అట్టలోపలి వైపున అచ్చువేసిన శిల్పచిత్రంలో కన బడేది శుద్ధోదన మహారాజుకు గౌతమబుద్ధుని తల్లి యైన మహారాణి మాయాదేవి కన్న స్వప్నం గురించి జ్యోతిష్కులు వ్యాఖ్యచేస్తూ ఉండిన దృశ్యం. వారికి దిగువ వారి వ్యాఖ్యను వ్రాసుకొంటున్న లేఖకుడు కనిపిస్తాడు. భారత దేశంలో లేఖన కళ చిత్ర శిల్పంలో నిబద్ధమై లభించే దృష్టాంతాలలో ఇదే ప్రాచీనతమమైనది.

నాగార్జున కొండ క్రీ. శ. 3 వ శతాబ్దం.

(జాతీయ పురావస్తు ప్రదర్శనశాల, న్యూఢిల్లీ, వారి సౌజన్యంతో).

భారతీయ సాహిత్య నిర్మాతలు

# ఏ. ఆర్. రాజరాజవర్మ

ఆంగ్ల మూలం :

కె. ఎం. జార్జ్

తెలుగుసేత :

జి. లలిత



సాహిత్య అకాడెమీ

*A. R. Raja Raja Varma*—Telugu translation by G. Lalitha of K. M. George's monograph in English, Sahitya Akademi, New Delhi, (1989) Rs. 5.



*First Published : 1989.*

సాహిత్య అకాడెమీ
ప్రధాన కార్యాలయం :
రవీంద్ర భవన్, న్యూఢిల్లీ–110 001

ప్రాంతీయ కార్యాలయాలు :
29, ఎల్డామ్స్ రోడ్, తేనాంపేట, మద్రాస్–600 018
బ్లాక్ V - బి, రవీంద్ర స్టేడియమ్ కలకత్తా–700 029
172, ముంబాయీ మరాఠీ గ్రంథ సంగ్రహాలయ మార్గ్, దాదర్,
బొంబాయి 400 014

రూ : 5

Weldun Press, Madras - 21.

# వి ష య సూ చి క

# కృతజ్ఞతలు

వ్రాతప్రతిని చదివి అమూల్యమైన సలహాల నిచ్చిన డా॥ కె. పి. కె. మీనన్, డా॥ కె. అయ్యప్పపణికర్ గారలకు; సాహిత్యపరమైన, కుటుంబ సంబంధమైన సందేహాలను నివృత్తిచేసిన, ఏ. ఆర్. రాజరాజవర్మ పుత్రులైన ప్రొఫెసర్. ఆర్. రాఘువవర్మగారలకు నా హార్ధికాభివందనాలు.

కె. యం. జార్జ్.

*అధ్యాయము 1*

# నేపథ్యం

యుగయుగాలుగా వర్ధిల్లిన ఏ సాహిత్య చరిత్రను పరిశీలించినా సజీవ సాహిత్యం సృష్టింపబడిన కాలాలు, క్షీణత, నిర్జీవత గల యుగాలతో కూడిన నిమ్నోన్నతాన్ని చూస్తాం. పురోభివృద్ధి సర్వదా సూటిగా ఉండక వృద్ధి క్షయాలతో మారిమారి రావడాన్ని గమనిస్తాం. ఈ సామాన్య సూత్రానికి మళయాళ సాహిత్యం అతీతం కాదు. మళయాళ సాహిత్యసీమలో శిఖరప్రాయులైన మహాకవులు చెరుస్సెరి (15. వ. శతాబ్దం) తుంచట్ ఎళుతచ్చన్ (16 వ. శ.) కున్‌జన్ నంబియార్ (18 వ. శ.) ఉన్నయి వారియర్ (18 వ. శ.) లు. ఈ మహాకవుల కావ్యాలు కావ్య శిల్పంలో వస్తుభావనలో విలక్షణములైనవి. సుప్రసిద్ధులైన ఈ కవుల్ని అల్పప్రతిభులైన రచయితలు కొందరు అనుకరించారు.

15. వ. శతాబ్దిలో చెరుస్సెరి నంబూదిరి రచించిన కృష్ణగాథ అనే మహా కావ్యానికి పూర్వమే మళయాళ సాహిత్యంలో ఆదియుగం వెలసిందని విజ్ఞుల అభిప్రాయం. ఆదిమకాలంలో తన రూపురేఖల్ని దిద్దుకునే దశలోనే, అప్పటికే గొప్పగా అభివృద్ధి పొందిన సంస్కృత, తమిళ సాహిత్యాలు తమ ప్రబల ప్రభావాన్ని మళయాళ సాహిత్యంపై ప్రదర్శించాయి. అయినా ఈ యుగానికి చెందిన మళయాళ జానపద గేయ సాహిత్య సంపద మనకు సంక్రమించింది. ఈ జానపద గేయాల్లో వ్యావహారిక భాష ఉపయుక్తమయింది. వాస్తవానికి కేరళలో కావ్యభాషని రూపొందించటంలో విభిన్నమైన మూడు సాహిత్య స్రవంతుల పాత్ర వున్నది. (1) దేశీయం. (2) తమిళం. (3) సంస్కృతం. రామచరితంలోని గేయరూపమైన సాహిత్యం ప్రాచీన తమిళ సాహిత్య

ప్రభావానికి నిదర్శనం. తొలి మణి ప్రవాళ రచనలు సంస్కృత ప్రభావానికి దృష్టాంతం.

పైన పేర్కొన్న మూడు విధాలైన ప్రక్రియలు శైలిలో వస్తువులో విభిన్నము లైనప్పటికీ పరస్పరం ప్రభావితమైనవి. మొదటిది దేశీయమైన సంప్రదాయం. అది నిరలంకార, నిరాడంబరమైనదైనా స్వచ్ఛమైనది. సెలయేరులా గమన వేగం కలది. రెండవది చిత్రవిచిత్రమైన శబ్దాడంబర ప్రధానమైనది. మూడవది గంభీరమై జలపాత సదృశమై జటిలమైనది. కేవలం పండితుల కుద్దేశింపబడినది. ఈ త్రివిధప్రక్రియల సమ్మేళనం 14. వ. శతాబ్దంలో రచితమైన "ఉన్నునీలీ సందేశము" "కణ్ణాస్సన్ పాట్టుగళ్" అన్న రచనల్లో స్పష్టంగా కనిపిస్తుంది. పైగా ఈ మూడు శైలులు సమపాళ్ళలో సమ్మిళితమై ఒక నూతన శైలి ఆవిర్భవించింది. ఆ కారణంగనే కృష్ణగాథ కావ్యంలో వ్యావహారిక భాష ప్రయుక్తమవడం చూడవచ్చు.

ఈ త్రివిధ ప్రక్రియల్లో శ్రేష్ఠమైన దానిని, ముఖ్యంగా సంస్కృత పరమైన ఉత్తమాంశాన్ని స్వీకరించే పద్ధతి తుంజత్తు ఎళుతచ్చన్ రచనలలో పరాకాష్ఠను పొందింది. ఈయన మళయాళ భాషకు ఔన్నత్యాన్ని, ప్రచారాన్ని తెచ్చిన రచయిత. ఎళుతచ్చన్ రచించిన రామాయణ మహాభారతాలలోని ఆధ్యాత్మిక దృక్పథానికి, సాహిత్య శోభకు పాఠకులు ముగ్ధులై రచయితకు సర్వదా ఋణపడియున్నారు.

ఆ తర్వాత ఒక శతాబ్దం గడిచిన మీదటే మళయాళ సాహిత్యరంగంలో మరో సాహిత్య శిఖరాన్ని చూడగలుగుతున్నాం. వాస్తవానికి శిఖరద్వయాన్ని చూడగలం. ప్రథమ శిఖరప్రాయుడు కథకళి సాహిత్యంలో అగ్రగణ్యుడైన ఉణ్ణాయివారియర్. ఇతడు నాలుగు రోజుల ప్రదర్శనకు అనువుగా "నలచరితం" ఆట కథను తన ప్రతిభావ్యుత్పత్తులకు నిదర్శనంగా నాటకీయ శిల్ప

ప్రధానంగా రచించాడు. అట్టి కళారూపాన్ని ఆస్వాదించడానికి రసజ్ఞులైన ప్రేక్షకు లవసరం. ఉత్సాహవంతుడు ఛలోక్తి ప్రియుడు అయిన కుంజన్ నంబియార్ సామాన్య ప్రజానీకానికి అందు బాటులో ఉండాలన్న ఆవశ్యకతను గుర్తించి "తుళ్ళల్" అనే ప్రక్రియని రూపొందించాడు. ఈ ప్రక్రియలో పండితపామరులు ఆనందింపగల రచనల్ని సృష్టించిన నంబియార్ పౌరాణిక గాథల్నే వస్తువుగ స్వీకరించినప్పటికీ అనన్య సామాన్యమైన ప్రతిభాసంప త్తితో ప్రతి కథను, ప్రతి సన్నివేశాన్ని సమకాలీన మొనర్చి ప్రేక్షకుల్లో సంభ్రమాశ్చర్యాన్ని కలిగించాడు. నంబియార్ 18 వ శతాబ్దికి చెందిన రచయిత. సంప్రదాయబద్ధమైన ప్రక్రియల్ని అధిగమించి సోపజ్ఞంగ వినూత్న ప్రక్రియల్ని రూపొందించడం పైన పేర్కొన్న మహా కవుల్లో ఎన్నదగిన మౌలికత.

కుంజన్ నంబియార్ నుండి 19. వ. శతాబ్ది మధ్యకాలం వరకున్న మలయాళ వాఙ్మయాన్ని క్షీణ యుగపు వాఙ్మయంగా పరిగణింపవచ్చు. ఆ తరువాతి కవులనేకులు సంస్కృత కవితా సంప్రదాయాల్ని పాటించి మళయాళంలో మహాకావ్యాలను, చంపూ కావ్యాలను, సందేశ కావ్యాలను రచించారు. ఈ సంప్ర దాయ ప్రక్రియా రచనలతోపాటు పాశ్చాత్య సాహిత్య ప్రభా వాన్ని కూడ మనం చూడగలం. సంస్కృత సమాస భూయిష్ఠమైన ఆలంకారిక శైలిని కొందరు అభిమానించారు. మరికొందరు దేశీ యమూ, సజీవమూ, శక్తిమంతమూ అయిన వ్యావహారిక భాషను ఎంపిక చేసుకున్నారు.

మళయాళ వాఙ్మయంలో స్వర్ణయుగం.

1850 వ సంవత్సరం తరువాత ఆరు దశాబ్దాలవరకు పద్య గద్య రచనలు చేసిన ప్రఖ్యాత కవులు రచయిత లనేకు లున్నారు. వారిలో పేర్కొనదగిన ప్రముఖులు :—

| | |
|---|---|
| కేరళవర్మ (1845-1915) | కవి, విద్వాంసుడు |
| ఏ. ఆర్. రాజరాజవర్మ (1863-1918) | పండితుడు, విమర్శకుడు |
| కొడుంగల్లూర్ కుఞ్ఞికుట్టన్ తంబురాన్ (1865-1913) | కవి, అనువాదకుడు |
| చందూ మీనన్ (1847-1900)<br>సి. వి. రామన్ పిళ్ళై (1858-1922) | నవలా రచయితలు |
| కుమరన్ ఆసన్ (1873-1924)<br>ఉళ్ళూర్ (1877-1949)<br>వళ్ళతోల్ (1878-1958) | ఆధునిక కవులు |

వీరందరు 19-వ శతాబ్దపు ఉత్తరార్థంలో జన్మించారు. వారి ఉత్తమ రచనలు 1880-1930 మధ్యకాలంలో వెలసాయి. ఈ కాలాన్ని మళయాళ వాఙ్మయపు పునరుజ్జీవన కాలంగా పరిగణింపవచ్చు. 1850. వ. సంవత్సరం తరువాత ఒక శతాబ్దకాలం మళయాళ వాఙ్మయానికి సువర్ణయుగమని స్థూలంగా చెప్పవచ్చు.

పై పట్టికలో ఎనమండుగురు రచయితలే పేర్కొనబడినా, ఉత్తమ రచనలతో మళయాళ సాహిత్యాన్ని సుసంపన్నం చేసిన వారనేకు లున్నారు. మళయాళ సాహిత్యోద్యాన వనంలో శతాధిక పుష్పాలు వికసించాయి. ఆ కాలం మళయాళ సాహిత్యంలో నిజంగా ఒక వసంతఋతువు. రచయితలనేకులు అపూర్వమైన ప్రక్రియల్ని, నూతన ఇతివృత్తాన్ని, నవీన కాంతిపుంజాల్ని ప్రవేశ పెట్టి మళయాళ సాహిత్యాన్ని ప్రభావిత మొనర్చారు. అయినా వారిలో అగ్రగాములుగ, మార్గదర్శకులుగ గుర్తింపదగినవారు కొందరు మాత్రమే. వారిలో కేరళవర్మ వలియకోయిల్ తంపురాన్. అతని మేనల్లుడు ఏ. ఆర్. రాజరాజవర్మ అనే రచయితలకు విశిష్ట స్థానమున్నది. నవ్య సాహిత్య నిర్మాతలలో వారు మహోన్నతులని అందరూ అంగీకరించారు.

కేరళవర్మ సాహిత్య సమ్రాట్టుగా గుర్తింపు పొందిన ప్రతిభాశాలి. సంస్కృత మళయాళ భాషల్లో ఆయనకున్న పాండిత్యం, కవితాపాటవం విద్యా సాహిత్యరంగాలకు సేవ చేయాలనే అభినివేశం, వీటితోపాటు రాజవంశానికి సన్నిహిత బంధువుగ ఆయనకు గల గౌరవం ఇవన్నీ ఆయన పూర్వాపరాలలో ఎవరూ పొందని ఆధిక్యతని, ఉన్నతిని ఆయనకు ప్రసాదించాయి. కవిగా సంస్కృత కవితాసంప్రదాయంలోని గంభీరతని, రమణీయతని గ్రహించినా, ఆంగ్ల విద్యావిధానం వలన కూడ ఆయన ప్రభావితుడయ్యాడు. పాఠ్యపుస్తక నిర్ణయ సమితి సభ్యుడుగా విద్యార్థులకు ఉపయుక్తమయ్యే సరళమైన, సహజమైన వచన రచనని ప్రోత్సహించేవాడు. అయితే తాను విద్వాంసుల నుద్దేశించి చేసిన రచనల్లో మాత్రం ఆలంకారికమైన కృత్రిమశైలిని ఉపయోగించేవాడు. ఈ విషయాన్ని ఆయన రచించిన "అక్బరు" అన్న నవలనుబట్టి తెలుసుకోవచ్చు. ఏ. ఆర్. రాజరాజవర్మ వైయాకరణుడు, కవి, విమర్శకుడు. మేనమామ పట్ల అత్యంత గౌరవాభిమానాలు కలవాడు. అయినా వారిద్దరి మధ్య సాహిత్య రచనలను గురించి, ప్రక్రియలను గురించి మౌలికమైన భిన్నాభిప్రాయాలుండేవి. ఛందోలంకారాలను గురించి భావయిత్రిని గురించి వారికున్న అభిప్రాయాలను, భావాలను ముందు ముందు పరిశీలించగలం.

ఏ. ఆర్. రాజరాజవర్మ జీవితాన్ని గూర్చి పాండిత్యాన్ని గూర్చి మహాకవి ఉళ్ళూర్ పరమేశ్వర అయ్యర్ తన సమగ్ర మళయాళ వాఙ్మయ చరిత్రలో ఇలా పేర్కొన్నారు :

"...ఆధునిక యుగంలో కేరళనాడులో ఇంతటి ప్రతిభా వ్యుత్పత్తులు. విచక్షణ జ్ఞానం, నిశిత దృష్టిగల మరొక రచయిత లేడు. ఏ కాలంలోనైనా, ఏ దేశంలోనైనా ఇటువంటి అసాధారణ ప్రతిభావంతులైన వ్యక్తులు అరుదు."

## అధ్యాయము 2

# వికాస దశ

రాజరాజవర్మ పూర్తిపేరు ఏ. ఆర్. రాజరాజవర్మ కోయి తంపురాన్. రాజ, వర్మ, తంపురాన్, కోయితంపురాన్ [1] (కోయిల్ + తంపురాన్)—ఇవన్నీ రాజవంశస్థుల్నీ, రాజబంధువుల్నీ సూచించే పేర్లు. ఈ పేర్లకు మళయాళ సాహిత్యంలో గల ప్రాముఖ్యాన్నిబట్టి ఒక చిన్న రాజవర్గానికి చెందినవారు కేరళదేశపు సాంస్కృతిక జీవనానికి ఎంత దోహదమొనర్చారో అన్నది గమనార్హం. రాజరాజవర్మ 1863. వ. సంవత్సరంలో జన్మించాడు. జన్మస్థలం తిరువనంతపురానికి ఉత్తరంగా 140 కిలో మీటరుల దూరంలోని చంగనాశేరిలోని లక్ష్మీపురంలోని రాజప్రసాదం. మలబారు శకం ప్రకారం ఆయన జన్మదినం 9, కుంభం 1038. రాజవంశీయులకి జన్మ నక్షత్రాన్ని అనుసరించి నామకరణం చేయటం సంప్రదాయం. రాజవర్మ పుట్టింది పురురుట్టాటి (పూర్వాభాద్ర 25. వ. నక్షత్రం.)

దక్షిణ మలబారులో సాంప్రదాయిక సంస్కృతికి గౌరవానికి ప్రఖ్యాతి గాంచిన పరప్పూర్ స్వరూపం వారితో చంగనాశే కోయితంపురాన్ లకు కుటుంబపరమైన సంబంధం ఉన్నది. హైదరాలి దండయాత్రల మరణకాండను తప్పించుకోడానికి అనేక కుటుంబాలు మలబారునుండి తిరువనంతపురానికి వలసపోయినట్లు చరిత్ర వల్లన తెలుస్తున్నది. పరప్పూర్ స్వరూపం వంశీయులు కొందరు అలా పారిపోయి వచ్చి కాందిశీకులుగా తిరువనంతపుర సంస్థానంలో తల

---

1, తంపురాన్—ప్రభువు. గౌరవవాచి. చెయిల్—రాచరికాన్ని, దేవాలయాన్ని సూచించే పదం.

కోయితంపురాన్ : యువరాణి భర్తను సూచించడానికి ఉపయోగించే పదం.

దాచుకున్నారు. వారిని ఉదార స్వభావుడైన తిరువనంతపురం మహారాజావారు చాల దయతో ఆదరించారు. అందువల్ల ప్రశాంత పరిస్థితి ఏర్పడిన తరువాత కూడ వారిలో చాలమందికి తమ స్వస్థలమైన మలబారుకు తిరిగి పోవడానికి మనస్కరించలేదు. అంతే కాకుండ తమకు కల్గిన రాజపోషణ, రక్షణ కారణంగా క్రమ క్రమంగా తిరువనంతపురపు రాజవంశంలో కొన్ని శాఖలతో వీరికి వైవాహిక సంబంధాలు ఏర్పడే అవకాశాలు కూడ కలిగాయి. అటువంటి సంబంధ బాంధవ్యాల్ని ఏర్పరచుకున్నవారిలో రాజరాజ వర్మ కుటుంబం ఒకటి.

రాజరాజవర్మ ఉన్నత సంస్కారవంతులైన తల్లిదండ్రులకు జన్మించాడు. తల్లి కుఞ్ఞిక్కవుతంపురాట్టి. ఆమె సాహిత్య సమ్రాట్ కేరళవర్మగారి పెత్తల్లి కూతురు. సుగుణాల సాధ్వి. తండ్రి వాసు దేవనంబూదరి పట్టియల్ ఇల్లం గ్రామవాసి. ఆయన గొప్ప వేద విద్వాంసుడు. హాస్యచతురుడు. ఆ కాలంలో నంబూదరీలకీ పేరు ప్రఖ్యాతులు గాంచిన క్షత్రియ, నాయర్ కుటుంబాలకీ వైవాహిక సంబంధాలు ఉండేవి.

బాల్యంలో రాజరాజవర్మను 'కొచ్చప్పన్' (=చిట్టిబాబు అని అర్థం) అని ముద్దుగా పిలిచేవారు. రాజరాజవర్మకు రెండేళ్ళ ప్రాయమప్పుడు లక్ష్మీపురం రాజాంతఃపురంలో కొన్ని కలతలు పుట్టాయి ఆ కారణంగా కొందరు కుటుంబ సభ్యులు చంగనాశేరికి 20 మైళ్ళ దూరంలో వున్న కార్తిక పళ్ళికి తరలివెళ్ళారు. ఆ పల్లెలో కేరళ వర్మ, రాజరాజవర్మలకు చాల ఇబ్బందులు కలిగాయి. కొన్నాళ్ళ తరువాత మహారాజాగారి సహాయ్యంతో హరిపాదులోని నూతన గృహాన్ని చేరుకున్నారు. ఈ నూతన గృహాన్ని ''అనంతపురం'' రాజప్రసాదమని వ్యవహరించేవారు. ఇక్కడే మన కథానాయకుడైన రాజరాజవర్మ తన బాల్యాన్ని గడిపాడు. విద్యాధికులైన మేన మామల ఆదరాభిమానాలతో మాతృమూర్తి అనురాగంతో

బాల్యదశ అంతా ఆనందంగా గడిచింది. ఆ కాలంలోనే కొచ్చ ప్పన్‌కు రెండు గండాలు సంభవించాయి. ఒకటి జలగండం. వర్షా కాలంలో ఒక రోజు భవన ప్రాంగణంలోని కొలనులో పడవ నడి పాడు. బంధువుల బాలు డొకడు, ఒక పనికత్తె మాత్రమే తనకు సాహాయ్యంగా ఉన్నారు. ఉన్నట్టుండి పడవ తలకిందులైనది. ముగ్గురూ నీళ్ళలో మునిగారు. నీటినుండి రక్షించేటప్పటికి పసివాళ్లు ఇంచుమించు ప్రాణావశిష్టులుగా ఉన్నారు. అదృష్టం కొద్దీ ప్రథమ చికిత్స వలన కోలుకున్నారు. కొచ్చప్పన్‌కు అప్పుడు ఏడేండ్ల వయస్సు. కొలను దగ్గరకు తీసుకువెళ్ళిన ఆడవాళ్ళకు ఈ సంద ర్భంలో పడిన చీవాట్లు అతడు జీవితాంతం మరచిపోలేదు. రెండ వది సర్పగండం. ఒక రోజు కొచ్చప్పన్ పాములు తిరుగాడే తోపులో వెళ్ళుతున్నపుడు కుడికాలు దేనికో కొట్టుకున్నట్లు తోచింది. కొంత సేపటికి కాలు బరువెక్కింది, వెంటనే ఇంటికి పరుగెత్తాడు. కాలిలో గాయమేదీ కనుపించలేదు. అయినా కాలు బరువెక్కి నొప్పి అధిక మయింది. నిజానికది పాము కాటే. కాని ఎలాగో రాజరాజవర్మ బ్రతికి బయటపడడం ఒక అద్భుతమైన సంఘటన.

## *ప్రాథమిక విద్యాభ్యాసం :*

రాజరాజవర్మ విద్యాభ్యాసం సుప్రసిద్ధులైన ఉపాధ్యాయుల వద్ద సంప్రదాయ పద్ధతిలో ప్రారంభమైనది. చునక్కర అచ్యుత వారియర్, శంకర వారియర్ అనే వారిద్దరు రాజరాజవర్మ ప్రథమ గురువులు. వారు ఆయనకు చదవడం, వ్రాయడం, గణించడం అనే మూడింటిని బోధించారు. తరువాతి ఘట్టం సంస్కృత కావ్యాధ్య యనం. అప్పట్లో రాజరాజవర్మ కొంత ఆకతాయిగా అల్లరివాడిగా ఉండేవాడు. అతనికి చదువుకన్న ఆటల్లో ఆసక్తి అధికం. గ్రామీణమైన ఆటల్లో అధిక నేర్పరి. అందువల్ల తోటి పిల్లలందరు అతన్ని తమ నాయకుడిగ పరిగణించేవారు. ఆరోగ్యంగా బలంగా వున్న వర్మ తోటివారి నందరిని అన్నివిధాలా మించివుండేవాడు.

ఎక్కువ శ్రద్ధ చూపకున్నా స్వతస్సిద్ధంగ ఉన్న తెలివితేటలవల్ల గ్రహణశక్తివల్ల ఉపాధ్యాయులు బోధించినదంతా సులభంగా స్వల్పకాలంలో గ్రహించేవాడు. అందువల్ల గురువులకు ప్రీతి పాత్రుడయ్యాడు.

రాజరాజవర్మకన్న అతని మేనమామ కేరళవర్మ పద్దెనిమి దేండ్లు పెద్ద. అప్పటికే కేరళవర్మ ప్రతిభగల రచయితగా పేరు పొందాడు. కాని అప్పట్లో తిరువనంతపురం రాజుతో కలిగిన భేదాభిప్రాయాల కారణంగా ఇల్లు వెడలని ఖైదీగా నిర్బంధింప బడ్డాడు. అతణ్ణి అలెపి నుండి హరిపాదుకు తరలించారు. ఈ దుస్సంఘటన తుదకు మళయాళ వాఙ్మయానికి లాభదాయకంగ పరిణమించింది. ప్రతిభాశాలి అయిన మేనమామ కేరళవర్మ సమ క్షంలో రాజరాజవర్మ సంస్కృత కావ్యాధ్యయనం చేయడానికి మంచి అవకాశం కలిగింది. రాజరాజవర్మ సదాచార మార్గంలో తన వ్యక్తిత్వాన్ని పెంపొందించుకోగలిగాడు. ఈ దశలోనే విద్య మీద ఆసక్తి, విద్యాభ్యాసంలో పట్టుదల అలవడ్డాయి. కేరళవర్మ "మయూర సందేశము" అనే సుప్రసిద్ధ సందేశ కావ్యాన్ని రచించడానికి రాజాగారి ఆగ్రహకారణంగా హరిపాదులో దుర్భర మైన భార్యావియోగానుభవమే కారణం. ఆ రేండ్లపాటు రాజ రాజవర్మ సంస్కృత కావ్యాధ్యయనంతోపాటు కవితా రచనను కూడా మేనమామ సహకారంతో అలవరచుకొన్నాడు. కేరళ వర్మకు మరిద్దరు శిష్యులు తన బంధువర్గంలోని వారే వుండేవారు, కేరళవర్మ పాఠప్రవచనావిధానం, రాజరాజవర్మ ప్రతిభావికాసం ఏరీతిగా సాగిందనే విషయానికి సంబంధించిన ఒక సంఘటన పేర్కొ దగినది. ఒకనాడు గురువర్యులు, గణపతిపై అష్టకాన్ని రచించి, మరునాటి మధ్యాహ్నం మూడు గంటలకు తెమ్మని తన శిష్యత్ర యానికి ఆజ్ఞాపించారు. ఆ శిష్యు లిరువురూ వెంటనే పద్య రచన కుపక్రమించి, తలలు గోక్కుంటూ పద్యాలు అల్లడానికి పూను

కున్నారు. ఆకతాయి కొచ్చప్పన్ కడపటి నిమిషంవరకూ పద్య రచనను గురించి పట్టించుకోలేదు. మధ్యాహ్నం రెండు గంటలైనపుడు ఆకస్మికంగా గుర్తుకురాగా ఏదో వ్రాయడానికి పూనుకొన్నాడు. రాజరాజవర్మ తక్కిన శిష్యుల్ని అనుసరించి సకాలానికి గురువు దగ్గరకు వెళ్లాడు. ప్రథమ శిష్యుని కవిత దోషభూయిష్ఠంగా వున్నా గురు వాతన్ని క్షమించాడు. ద్వితీయ శిష్యుని కవిత్వం సంతృప్తికరంగ ఉన్నందున అతన్ని మెచ్చుకొన్నాడు. రాజరాజవర్మ భయంతో గురు సమక్షానికి వచ్చాడు. తను వ్రాసిన అష్టకాన్ని బిగ్గరగా చదువమని గురువు ఆదేశిస్తే కొంత జంకుతూ చదువసాగాడు. గురువు మరలా చదువుమని కోరాడు. గురువు తాను రచించిన అష్టకాన్ని తెప్పించియిచ్చి రాజరాజవర్మను చదువమన్నాడు. ఆ అష్టకద్వయ పఠనానంతరం ఆ గురు శిష్యులు పరస్పరం మందహాసంతో విలోకించుకొన్నారు. గురువు రచించిన అష్టకంతో సమానస్థాయిలోనే రాజరాజవర్మ రచించిన అష్టకమూ ఉంది. తన మేనల్లుని కవితా పాటవాన్ని మేనమామ వర్మ మెచ్చుకొన్నాడు. మేనల్లుడూ ఉప్పొంగిపోయాడు. గురువు మరొక ఎత్తుగడ పన్నాడు. ఈ అష్టకాల రెండింటికి కర్తల పేరుల్ని తెలుపకుండ వాటికి నకళ్ళు వ్రాయించి తమ అన్నగారికి పంపించాడు. విద్వాంసుడైన అన్నగారు కవితలో సిద్ధహస్తుడైన తన తమ్ముని రచనని గుర్తించాడు. అజ్ఞాత కర్తృకంగా పంపిన రెండవ అష్టకం మొదటిదానితో సమంగా ఉన్నదని మెచ్చుకొన్నాడు. తరువాత ఆ నూతన కవి ఎవరన్నది తెలిసినపుడు అందరూ ఆనందించారు. రాజరాజవర్మకు మంచి బహుమతులు లభించాయి. ఈ సంఘటన సంభవించినపుడు రాజరాజవర్మ వయస్సు పదునైదు వత్సరాలు మాత్రమే.

ఆసక్తికరమైన మరొక సంఘటన ఏలత్తూర్ రామస్వామి శాస్త్రిగారి రాజప్రాసాదాన్ని సందర్శించినపుడు జరిగింది. శాస్త్రి

గారు కేరళవర్మకు గురువులు. వారు ప్రశిష్యుల అంటే కేరళవర్మ శిష్యులు-ప్రజ్ఞావిశేషాల్ని పరీక్షించాలనుకున్నారు. కువలయానందం లోని "ఆద్యపి తిష్ఠతి" అనే శ్లోకంతో మొదలుపెట్టి కొన్ని శ్లోకాలు పఠించి, వాటిని వివరించండని విద్యార్థుల్ని కోరారు. పసివాడైన రాజరాజవర్మ ఆ శ్లోకాల్ని వ్యాఖ్యానించిన విధానానికి, విశదీకరించిన అంతరార్థానికి, శిల్పానికి మహా పండితుడైన శాస్త్రిగారు ఆశ్చర్యపడ్డారు. ఆ బాలుని మెచ్చుకొన్నారు. ఈ లాంటి ప్రోత్సాహం సహృదయుడైన ఆ యువకవి అభ్యుదయ వికాసానికి దోహదం చేసింది.

ఈ విధంగా రాజరాజవర్మ బాల్యదశలోనే సంస్కృత కవికుండవలసిన ప్రతిభావ్యుత్పత్తుల్ని ప్రదర్శించాడు సంస్కృత ఛందో వ్యాకరణాలంకార శాస్త్రాలలో అసమాన ప్రజ్ఞను గడించి, కవితలు వ్రాయసాగాడు. అతని కవితా మాధుర్యాన్ని గూర్చి ఆతని కుటుంబ సభ్యులకే కాక, అతని మామ మూలముగ తిరువనంత పురంలోని మహారాజా వారికి కూడ తెలిసినది.

1880. వ. సంవత్సరం తిరువనంతపుర సంస్థానానికి విశాఖం తిరునాళ్ రాజు కావడంతో కేరళవర్మకు అదృష్ట చక్రం అనుకూలంగా తిరిగింది. అనంతపుర రాజప్రాసాద వాసులకందరికి తగినంత ప్రోత్సాహం లభించింది. అనతికాలంలోనే కేరళవర్మ తిరువనంతపురం చేరుకొన్నాడు. రాజరాజవర్మకు విద్వత్కవి అయినా విశాఖం తిరునాళ్ తో సన్నిహిత సంబంధం ఏర్పడింది. త్వరలో యువకవి రాజరాజవర్మ కూడా తిరువనంతపురంచేరి విద్యను కొనసాగించడం మంచిదని సూచింపబడింది. రాజరాజవర్మ ఇరువురు విద్యార్థులతో కలసి తిరువనంతపురం చేరుకొని అక్కడ "చంగనాశేరి మూటత్తుమఠం" లో వుంటూ, ఒక ఉన్నత పాఠశాలలో చదువు కొనసాగించాడు. ఇదంతా కేరళవర్మ ఆధ్వర్యంలో ఏర్పాటయినట్లు వేరే చెప్పనక్కరలేదు.

1881. వ. సంవత్సరం నుండి రాజరాజవర్మకు ఉన్నత పాఠశాలావిద్య ప్రారంభమైనది. రాజరాజవర్మ తెలివి తేటలు గల విద్యార్థే. అయినా కొన్ని పాఠ్యాంశాలు అతనికి కొరుకుడు పడలేదు. లెక్కలు అతనికి పెనుభూతంలా తోచేది. లెక్కల్లో మార్కులు పది శాతానికన్న తక్కువే వచ్చినా అతని సగటు మార్కులు 70 శాతం మించి వుండేవి. కాబట్టి ఆ పాఠశాల ప్రధానోపాధ్యాయుడైన దొరగారి సిఫారసుతో పై తరగతికి వెళ్ళాడు. అతడు సంస్కృత భాషని రెండవ భాషగా అధ్యయనం చేసినా, మళయాళ భాషను కూడ నేర్చుకోవలసి వచ్చింది. ఆ కాలంలోనే ప్రప్రథమంగా మళయాళ వ్యాకరణంలో ఆసక్తి కలిగింది. సంస్కృతంలో అతని పాండిత్యం తనతో సమానంగా ఉన్నట్లు ఉపాధ్యాయుడు చెప్పేవాడు. క్లిష్టమైన భాషాసాహిత్యాంశాల్ని గూర్చి వారిద్దరు పరస్పరం సంప్రదించుకొనేవారు. ఆ రోజుల్లో విద్యా ప్రణాళికలో మళయాళ భాషకు తక్కువ స్థానం. సంస్కృత భాషాభిమానియైన రాజరాజవర్మ కూడ అలాంటి భావాన్నే మొదట ప్రదర్శించాడు. అప్పటి మళయాళ పాఠ్యపుస్తకాలు విసుగు కలిగించేలాగ వుండేవి కాబట్టి మాతృభాషను గురించిన చులకన భావం కొంతవరకు సమంజసమే.

ప్రజ్ఞావంతుడైన మహారాజుగారు ప్రతిభావంతుల్ని ప్రోత్సహించదలంచారు. తాను నిర్ణయించిన అంశంపై సంస్కృతంలో ఎనిమిది పుటల వ్యాసాల్ని విద్యార్థులు వ్రాయాలి. అందులో ఉత్తమ వ్యాసానికి మంచి బహుమతి ఈయబడుతుందని ప్రకటించారు. ఆ వ్యాసాన్ని మొదట మహారాజుగారే స్వయంగ పరిశీలించి, పిదప వాటిని అనుశీలింప కేరళవర్మకు ఇచ్చారు. మన యువకవి రాజరాజవర్మ కూడ పోటీలో పాల్గొన్నాడు. రాజరాజవర్మ రచించిన వ్యాసమే ఉత్తమమైదవని మహారాజుగారు, కేరళవర్మ ఇద్దరూ ఏకాభిప్రాయాన్నే వ్యక్తపరిచారు. ఉన్నతాధికారు

లకు ఈ యువ రచయిత పట్లగల ఆసక్తిని పెంపొందించిన సంఘట నల్లో ఇదొకటి. ఉన్నత పాఠశాలలో విద్య కొనసాగుచుండగా, కేరళవర్మ తన మేనల్లునికి సంస్కృతభాషా పాండిత్యాన్ని ప్రత్యే కంగా పెంపొందింపచేశాడు.

## ఉన్నత విద్య:

తిరువనంతపురంలో స్నేహితులతో ఉల్లాసంగా కాలం గడుపుతుండిన రాజరాజవర్మ మెట్రిక్యులేషన్ పరీక్షలో సుల భంగా ఉత్తీర్ణుడయ్యాడు. విశ్వవిద్యాలయంలో విద్య ఆరంభించే తరుణంలో ఒక గొప్ప ఆపద సంభవించడంవల్ల అతని విద్యకు అంత రాయం కలిగింది. 1884 లో అతని తల్లి మరణించింది. మాతృ వియోగం అతన్ని క్రుంగదీసింది. ప్రియమైన తల్లిగారి అకాల మరణం వల్ల కలిగిన ఆవేదన అటుండగా, ఒక ఏడాదిపాటు ఇంటి గడప దాటకుండా తల్లికి చేయవలసిన కర్మకాండ కారణంగా చదువుకు స్వస్తి చెప్పవలసివచ్చింది. ఒక సంవత్సరకాలం క్షురకర్మ లేకుండ ఇంటి దగ్గరే కొన్ని కర్మల్ని ఆచరింపవలసివచ్చింది. ఒక ఏడాది చదువును వృథా చేయడం రాజరాజవర్మకు మనస్కరించలేదు. కనుక చదువుకొనసాగించడానికి కేరళవర్మను, తదితర పెద్దలను ప్రాధేయపడ్డాడు. కాని పూర్వాచారాలు కొన్నింటిని అతిక్ర మించవచ్చునని అతనికి సలహానివ్వడానికి ఎవరూ సాహసింపలేదు. తుదకీ సమస్య మహారాజావారి దృష్టిలోకి వచ్చింది. రాజుగారు అందరూ సంతోషించదగ్గ పరిష్కారాన్ని సూచించారు. మహా రాజావారి పుత్రుడు శ్రీ నారాయణ తంపి మద్రాసు విశ్వవిద్యా లయపు యఫ్. ఏ. పరీక్ష వ్రాయనుండెను. అతని కొరకు రాజ ప్రాసాదంలోనే ప్రయివేట్ ట్యూషన్ ఏర్పాటు చేసారు. తంపితో కూడ కొచ్చపన్‌కు కూడ ట్యూషన్‌ను రాజాగారు ఏర్పాటుచేశారు. ఈ పరిష్కారం లాభదాయకమైంది. కొచ్చ పన్‌కు పైసా ఖర్చులేకుండా ఉత్తమ విద్యాబోధన లభించింది.

పరీక్ష వ్రాయడానికి మదరాసు విశ్వవిద్యాలయం నుండి ప్రత్యే కంగా అనుమతిని పొందవలసి వున్నది. మహారాజావారే యీ విషయంలో ఆసక్తి కలిగి ఉండటంచేత ఇది సమస్యే కాకపోయింది. కాని దురదృష్టవశాత్తు విశాఖం తిరునాళ్ అనతికాలంలో మరణించాడు. కాబట్టి రాజరాజవర్మ తరువాత మహారాజావారి కళా శాలలో చేరవలసివచ్చింది. యఫ్. ఏ. పరీక్షలో 1886 లోనే ఉత్తీర్ణుడయ్యాడు.

ఆ తరువాత రాజరాజవర్మ బి. ఏ. తరగతిలో చేరాడు. బాల్యంలో లాగానే ఆటలలో అధిక ఆసక్తిని చూపేవాడు. తిరువనంతపురంలో అప్పు డప్పుడే ప్రసిద్ధికి వస్తున్న టెన్నిస్ ఆట మీద శ్రద్ధ కలిగింది. ఈతలోనూ ఉత్సాహం చూపేవాడు. పాఠ్యపుస్త కాల్ని చదవడంలో కాలాన్ని గడపటం కన్న, ఉత్తమ కావ్య పఠనంలోను. కవిత అల్లడంలోను, అక్షర శ్లోక పోటీలలో పాల్గొన టంలోను అధిక శ్రద్ధను చూపేవాడు. ఇలా నిర్ణీత పాఠ్యాంశాల పట్ల అశ్రద్ధ వహించినా, సర్వతోముఖ వ్యక్తిత్వం ఆతనిలో అభి వృద్ధిపొందింది. బి. ఏ. పరీక్షల్లో, సంస్కృతాంగ్ల భాషల్లో గణ నీయంగ ఉత్తీర్ణుడయినా, తాను ప్రత్యేకంగా ఎన్నుకొన్న రసాయన శాస్త్రంలో తప్పాడు. ప్రయోగాలు చేయడంలో ఉత్తీర్ణుడు కాలేదు. అయితే తరువాత జరిగిన పరీక్షల్లో పాసైనాడు. రాజ రాజవర్మ దినచర్య పుస్తకాలను పరిశీలిస్తే, పాఠ్యాంశాలపట్ల చూపిన శ్రద్ధ అతనికి అసంతృప్తిని కలిగించినట్లు స్పష్టమవుతుంది. అయితే ఏ విషయంలోనైనా ఏకాగ్రతని వహిస్తే, సులభంగానే ఆ విషయంలో ప్రావీణ్యాన్ని సాధించేవాడు. ఇందువల్లే బి. ఏ. తర గతి ప్రథమ సంవత్సరాంత పరీక్షల్లో ప్రథమస్థానంలో పాసై బహుమతిని కూడ పొందాడు. సంస్కృత ప్రశ్నలకి సమాధానాల్ని పద్యాలలో వ్రాసి, పరీక్షాధికారుల్ని ఆశ్చర్యచకితులను చేసే వాడు. ఈ సంఘటనలన్నీ రాజరాజవర్మ అసాధారణమైన ప్రతిభ గల విద్యార్థి అనడానికి నిదర్శనాలు.

బి. ఏ. పరీక్ష తప్పడం వల్ల రాజరాజవర్మ మనస్సు గాయ పడింది. తన హృదయావేదనని ఇరవై ఎనిమిది సంస్కృత శ్లోకాల్లో వ్యక్తం చేసుకొని కొంత ఉపశమనాన్ని పొందాడు. విషాద భావభరితమైన ఈ లఘు కావ్యానికి "భంగ విలాపము" అని నామకరణం చేశాడు. చదువుపట్ల శ్రద్ధ చూపలేకపోయి నందుకు అతడు బాధపడినట్లు అతని దినచర్య పుస్తకాలు తెలుపు తున్నాయి. [1]

రసాయనశాస్త్ర ప్రయోగ పరీక్షలకని మొట్టమొదటిసారిగా తాను మదరాసునకు సాహసించి చేసిన ప్రయాణాన్ని గురించిన కొన్ని ఆసక్తికరమైన విషయాలు అతని డైరీలో గ్రంథస్థమై ఉన్నాయి. తిరువనంతపురం నుండి మద్రాసు చేరడానికి ఆ చిన్న విద్యార్థి బృందానికి వారంరోజులు పట్టింది. ఆ రోజుల్లో వారు షోరనూరు నుండి మాత్రమే రైలు ఎక్కగలరు. షోరనూరు చేర డానికి కొంత దూరాన్ని పడవలో, మరికొంత దూరాన్ని ఎద్దు బండిలో ప్రయాణం చేయవలసివుండేది. కనుక ఆ రోజుల్లో గుర్తింపబడిన విశ్వవిద్యాలయాల్లో ఉన్నత విద్య అభ్యసించడానికి సుదూర ప్రాంతాల్లోని విద్యార్థు లెంత వ్యయ ప్రయాసలకు ఓర్చ వలసి ఉండేదో ఊహించుకోవచ్చు.

## వివాహం :

రాజరాజవర్మ అన్ని అర్హతలు కల వరుడవటంచేత, రాజైన విశాఖం తిరునాళ్ కూడ తన పుత్రిక నిమిత్తం అతనిపై ఒక కన్ను వేసి ఉంచాడు. కాని ఆ రాజు అకాలమరణం, తదితర విషయాలు విధిని మరొక విధంగా మార్చాయి. పెద్ద మేనమామ కోయితంపు రాన్ రాజరాజవర్మ వివాహ విషయంలో తానే ఒక నిర్ణయాన్ని

---

1. ఈ రోజు నేను ప్రయోజనకరమైనదేదీ చేయలేకపోయాను. నా సోమరితనానికి సిగ్గుపడుతున్నాను. సోమరులెప్పుడూ జ్ఞానాన్ని సముపార్జించ లేరు.

తీసుకొని తన తృతీయ పుత్రికయైన "స్వాతితిరునాళ్ మహాప్రభ తంపురాట్టి"ని రాజరాజవర్మ కిచ్చి సాంప్రదాయికంగా 1889 లో వివాహం చేశారు. ఆది మహావైభవోపేతమైన ఆనందదాయక మైన వివాహమహోత్సవం. పతిపట్ల తంపురాట్టికి ప్రగాఢానురాగం, పూజ్యభావం ఉండేవి.

ఇరవైయారేండ్ల రాజరాజవర్మ అప్పటికి పరిణతి నందిన వ్యక్తి, పండితుడు, కవి. రసాయన శాస్త్రంలో ఉత్తీర్ణుడు కావలసిన అతడు, ఆ మరు పరీక్షలోనే సునాయాసంగ గట్టెక్కాడు. ఈ విధంగా మన యువ రాజరాజవర్మ మలయాళ క్షత్రియ కులజులలో ప్రథమ పట్టభద్రుడయ్యాడు. ఈ వర్ణంలోని వారు తమ పోషణ లోని పండితుల్ని విద్వాంసుల్ని చూచి గర్వించేవారు. కాని పాఠ శాలలకి వెళ్ళి చదువుకోడానికి ఇష్టపడేవారు కాదు. ఇంటిపట్టునే గురువుల్ని ఏర్పరచుకొని విద్య నభ్యసించేవారు. అట్టి విద్య ప్రమా ణాలకు భిన్నంగ ఉండేది. కనుక రాజరాజవర్మ మద్రాసు విశ్వ విద్యాలయపు [1] పట్టభద్రుడైనపుడు ఆ కులం వారు మిక్కిలి ఆనందించారు. ఈ సందర్భంలో ఆయన అనేక బహుమానాల్ని ప్రశంసల్ని అందుకొన్నాడు. అన్నింటిలో అత్యంత అమూల్యమైనది శ్రీమూలం తిరునాళ్ మహారాజా వారు బహూకరించిన రత్న ఖచిత స్వర్ణకంకణం.

## తొలి రచనలు:

ఈ కవి సంస్కృతంలో శ్లోకాల్ని వ్రాయడానికి చేసిన ప్రయత్నాల్ని గూర్చి ముందే ప్రస్తావించబడింది. యం. ఏ. పరీక్ష వ్రాసి, మదరాసు నుండి తిరిగి వచ్చిన వెంటనే "విమానాష్టకం" రచించాడు. మదరాసులో ఒక యూరపు దేశస్థుడు వాయువు

---

1. ఆ దినాలలో దక్షిణ భారతదేశానికంతటికి ఒక్క విశ్వవిద్యాలయం మద్రాసులో మాత్రమే ఉండేది.

నింపిన విమానంలో అంతరిక్షానికి ఎగరటానికి చేసిన ప్రయత్నమే ఇందులోని ఇతివృత్తం. ప్రేక్షకుల ఉత్తేజాన్ని చక్కగా అభివర్ణించాడు. "పితృ విలాపము" అనే కావ్యం సంతాన వియోగభరితుడైన తండ్రి దుఃఖాన్ని తెలుపుతున్నది. రాజరాజవర్మ ద్వితీయ పుత్రిక అకాలమరణాన్ని గూర్చిన హృదయ విదారకమైన సంస్కృత స్మృతి కావ్య మిది. ఈ కాలంలోనే స్నేహితుల సూచనలనను సరించి, అప్పు డప్పుడు పత్రికలకు పంప ఉద్దేశించి రచించిన కవితలు కూడ ఉన్నవి. దేవీ మంగళం, సరస్వతీ స్తవమ్, రాగముద్రాస ష్టకమ్, శ్రీ పద్మనాభ పంచకమ్, దేవీ దండకమనేవి అందులో కొన్ని. గైర్వాణి విజయమన్న కృతి ఆంగ్ల భాషకన్న సంస్కృత భాష మిన్నయని ప్రశంసించే ఏకాంకిక. "ఉద్దల చరిత్ర"[1] మనే గద్యకావ్యం ఒథెల్లో నాటకానువాదం. ఈ గ్రంథాలన్నీ సంస్కృతంలో రచింపబడి ఉండటం ప్రత్యేకంగా గమనింపదగిన విషయం. ఈ విద్వాంసుడు మాతృభాషపై దృష్టి మళ్ళించడానికి మరికొంత కాలం పట్టింది. 1894 వ సంవత్సరం నాటి తన డైరీలో ఒక వాక్యం మాతృభాషైన మళయాళాన్ని అభివృద్ధి పరచటమే ఆయన జీవిత లక్ష్యంగా తెలుపుతోంది.

కేరళవర్మ సూచన ననుసరించి రాజరాజవర్మ మళయాళ మనోరమ, బ్రహ్మవిద్య, విజ్ఞాన చింతామణి, విద్యావినోదిని, మొదలైన మళయాళ పత్రికలకు వ్రాయ ప్రారంభించాడు. సంస్కృతంలో, మళయాళంలోనే కాక అప్పు డప్పుడు ఆంగ్లంలో కూడ రచనలు చేసేవాడు.

1. మరికొన్ని వివరాలకు ఆరవ అధ్యాయాన్ని చూడండి.

అధ్యాయము 3

# ఉపాధ్యాయుడు - పరిశోధకుడు

రాజవంశస్థులతో సంబంధాలు రాజరాజవర్మను సంపన్నుని చేయలేదు. విద్యార్థి దశలో అతనికి వచ్చే డబ్బు అతని నిత్యావసరాలకు మాత్రమే సరిపడేది; ఆతని మేనమామ కేరళవర్మ తరచుగా అతనికి సహాయం చేసే వాడనడంలో సందేహంలేదు. మహారాజావారు కూడ ఉదారంగా ధనమిచ్చేవారు. కాని రాజరాజవర్మ స్వతంత్రంగ తన కాళ్ళపై తాను నిలబడాలని కోరేవాడు. కనుక పట్టభద్రుడైన తరువాత రాష్ట్ర ప్రభుత్వోద్యోగిగా చేర అభిలషించాడు. ఆ రోజుల్లో రాజవంశజులు ప్రభుత్వోద్యోగాల్లో చేరటం ఆచారవిరుద్ధం. కాని రాజరాజవర్మ ప్రభుత్వోద్యోగానికై ప్రయత్నిస్తున్నాడని తెలిసినపుడు పూర్వాచార పరాయణులు ఆశ్చర్యపడ్డారు. అయితే రాజరాజవర్మ అర్థంలేని యీ దురభిప్రాయాన్ని లక్ష్యపెట్టలేదు.

ఆ రోజుల్లో తిరువనంతపురంలో ఒక సంస్కృత పాఠశాలని ప్రారంభింప రాష్ట్ర ప్రభుత్వం నిర్ణయించింది. ఆ సంస్థ భవిష్యత్తును తీర్చి దిద్దగల వ్యక్తి రాజరాజవర్మ అని స్పష్టంగ తెలిసివున్నా, అతడు వయస్సులో పిన్నవాడని ఆటంకాన్ని తెలిపారు. కాని తుదకు 1890 లో అతనినే ఆ పాఠశాల ప్రధానాధ్యాపకునిగ నియమించారు. ఆ పాఠశాలకు ప్రత్యేకమైన పాఠ్యప్రణాళికగాని, బోధన కాలపట్టికగాని, పాఠ్య ప్రవచన నమూనా కాని ఏదీ అప్పటికి లేదు. రాజరాజవర్మ వీటన్నింటిని ఏర్పరచి సంస్కృత పాఠశాల స్థాయిని ప్రమాణాన్ని పెంపొందించాడు. బ్రాహ్మణేతరులకి సంస్కృత పాఠాల్ని బోధించుటం ఈ పాఠశాల యొక్క ప్రత్యేకత.

ఈ నూతనోద్యోగం వలన రాజరాజవర్మ తిరువనంతపురం లోనే స్థిరనివాస మేర్పరచుకోవలసిన ఆవశ్యకత ఏర్పడింది. ప్రసిద్ధ పండితులైన నారాయణశాస్త్రి, గణపతిశాస్త్రి అన్న ఇద్దరు సహాధ్యాపకుల తోడ్పాటు లభించింది. కేరళవర్మ ఆదేశాను సారం అప్పటికే రాజరాజవర్మ సంస్కృతంలో యం. ఏ. పట్ట పరీక్షకు స్వయం అభ్యర్థిగా నమోదు చేసుకున్నాడు. కాని పాఠ శాల పనుల ఒత్తిడి కారణంగ, అధ్యయనం సంతృప్తికరంగ సాగ లేదు. అంతేకాకుండ సరదాలు, విలాసాలు ప్రక్కనపెట్టి, కష్టించ డానికి ఇష్టంలేదు. చదరంగం, పేకాట, గుఱ్ఱపుస్వారీ, ఇంకా తదితర విరామక్రీడల్లో అవశ్యం పాల్గొనవలసినదే! యం. ఏ. ప్రణాళికలో ఒక లఘు సిద్ధాంత వ్యాసాన్ని వ్రాయాలి. దానికి ''నారాయణభట్టు - అతని కృతులు'' అన్న అంశాన్ని ఎన్ను కొన్నాడు. కొంతవర కాతని సహాధ్యాపకులు తోడ్పడ్డారు. సంప్ర దాయ పద్ధతిలో వారిద్దరూ మంచి పండితులే, అయినా వారికి పరి శోధనకు అవసరమైన క్రమశిక్షణగాని, మేధకాని లేదు. గుణదోష విచారణకవసరమైన పరిజ్ఞానం వారికి లేదు. అందువలన రాజరాజ వర్మ అధికంగా స్వశక్తిపైననే ఆధారపడవలసి వచ్చింది. ఇండియన్ ఆంటిక్వేరి (Indian Antiguary) వంటి పత్రికల్ని నిశితంగా పరి శీలించి, అందుండి ఉపయోగకరమైన విషయాన్ని సేకరించడంలో నిమగ్నుడయ్యాడు. సకాలంలో అత్యుత్తమ వ్యాసాల్ని వ్రాయ డంలో కృతకృత్యుడయ్యాడు. 1891. వ. సంవత్సరంలో పరీక్షను వ్రాసి, విశ్వవిద్యాలయంలో ప్రథమ స్థానాన్ని సంపాదించినా, ద్వితీయ శ్రేణిలోనే (Second class) ఉత్తీర్ణుడయ్యాడు. ఆరోజుల్లో మిక్కిలి తెలివితేటలుగల ఇటువంటి విద్యార్థులకు కూడ ప్రథమశ్రేణి (First class) లభించడం కష్టతరంగ ఉండేది. రాజరాజవర్మ సమా ధానాలకు ముగ్ధుడయిన ప్రధాన పరీక్షాధికారి అయిన శేషగిరి శాస్త్రి, విశ్వవిద్యాలయం వారికి రాజరాజవర్మ పరీక్షా పత్రాన్ని

భద్రపరచవలసినదని సలహా నిచ్చాడు. గ్రీకు భాష నుండి సంస్కృత భాష గ్రహించిన పంద్రెండు పదాల్ని పేర్కొనండి అన్నది ఒక ప్రశ్న. ఈ అభ్యర్థి పంద్రెండుకు బదులు ముప్పైపదాలని వ్రాయడం ఆ పరీక్షాధికారికి ఆశ్చర్యాన్ని కలిగించింది. అనువాదానికి ఇచ్చిన మిల్టనుకవి కవితాభాగాల్ని అభ్యర్థి చక్కని పద్య రూపంలో అనువదించాడు. సంస్కృతంలో ప్రావీణ్యతకు ఇచ్చే రాస్ బంగారు పతకాన్ని, మునిస్వామిసెట్టి పతకాన్ని రాజరాజవర్మ పొందాడు.

*సంస్కృత కళాశాల:*

1894. వ. సంవత్సరం రాజరాజవర్మ సంస్కృత కళాశాల ప్రధానాచార్యుడుగ నియమితుడయ్యాడు. పాఠ్యప్రణాళికాంశాల్ని మెరుగుపరచడానికి, కళాశాలని అభివృద్ధిచేయడానికి ప్రధానంగా రాజరాజవర్మ తన శక్తినంతటిని కేంద్రీకరించాడు. ఈ అభివృద్ధి కార్యక్రమానికై ప్రభుత్వానికి అనేక సిఫారసుల్ని చేశాడు. వాటిలో కొన్ని ఆ తరువాత చాల కాలానికి ఆమోదముద్రను పొందాయి. పాఠ్యప్రణాళికలో సాహిత్యాన్ని, ఆయుర్వేదాన్ని, జ్యోతిష్యాన్ని పాఠ్యాంశాలుగ చేర్చమని కోరాడు. జాతీయకళలకి, విజ్ఞాన శాస్త్రాలకి, వాఙ్మయానికి ప్రాముఖ్యతను ఈయాలన్నది ఆయన అభిమతం. భూగోళశాస్త్రం, చరిత్ర, బీజగణితం, త్రికోణమితి, పాఠ్యప్రణాళికలో చేర్చాడు. బీజ, త్రికోణ గణితాల పాఠాల్ని స్వయంగ బోధించడమేకాక వాటికి సంబంధించిన పాఠ్య పుస్తకాల్ని సంస్కృతీకరించాడు. ఆ రోజుల్లో ప్రధాన నిర్ణయాలు చేసే సమితుల్లో ఆంగ్లేయులైన ఆచార్యుల, వారి అనుయాయుల అభిప్రాయాల్నే ఆమోదించేవారు కాని ఇంచుమించు ఇరవై అయిదేండ్ల కాలంపట్టినా, ఈ పండితుని సూచనలన్నీ, అమలు జరుపబడినట్లు చరిత్ర వెల్లడిస్తున్నది. ప్రపంచ భాషల్లో మహోత్తరమైనవిగా గుర్తింపబడిన సంస్కృతాంగ్లాలపట్ల ఈ కవికిగల

దృక్పథాన్ని "గైర్వాణీవాణీ విజయము" "ఉద్దల చరిత్రము" అనే గ్రంథాలు వ్యక్తం చేస్తాయి. పరిణతి చెందని తన మాతృభాష మళయాళ వికాసానికి ఈ భాషాద్వయం అనేక విధాల తోడ్పడగలదని ఆయన గుర్తించాడు. తన సహాధ్యాపకులైన శాస్త్రిద్వయానికి ఆంగ్ల భాషను నేర్పించాడు. వారిలో గణపతి శాస్త్రి మహాకావ్యాల పరిష్కర్తగ, సంపాదకుడిగ ప్రసిద్ధి కెక్కాడు. రాజరాజవర్మ విద్యారంగంలో తన స్థానాన్ని ఎలా పెంపొందించుకోనాలని ఆతురతపడినది, పై అధికారులు ఎలా సూటిపోటి మాటలతో వేధించినది ఆనాటి అతని డైరీలు, లేఖల వలన మనకు తేటతెల్లమవుతుంది. మదరాసు ప్రాంతంలో తగిన పదవులకొరకు అతడు ప్రయత్నించాడు. ఆ రోజుల్లో ప్రాంతీయ భాషలంటే చిన్న చూపు. ఆంగ్ల భాషకే అగ్రతాంబూలం. ఆంగ్ల విద్యాధికులైన అహంభావు లనేకులు "మళయాళంలో నేర్చుకోడాని కేమున్నది?" అని తరుచూ ప్రశ్నించేవారు. సంస్కృతభాషా ప్రవీణుడైన రాజరాజవర్మ మళయాళ భాషకు మంచి భవిష్యత్తున్నట్లు దూరదృష్టితో చూడగలిగాడు. ఈ విష యంలో అతని మేనమామ కేరళవర్మ అతనితో సహకరించాడు. సాహిత్యమన్నది కేవలం కాలక్షేపానికే కాక జీవితంలో మార్గదర్శ కత్వాన్ని నిర్వహించగలదనే సత్యాన్ని రాజరాజవర్మ తన జీవి తంలో తరువాత దశలో గ్రహించాడు.

## *దేశభాషల అధ్యయన పర్యవేక్షకుడు:*

1896 - 1898 - సంవత్సరాల మధ్యకాలంలో ఆయుర్వేద సంస్థాధికారి బాధ్యతల్ని, కళాశాల ప్రధానాచార్య బాధ్యతల్ని రెంటిని ఒక్కరే నిర్వహించాలి అన్న ప్రతిపాదనని ప్రభుత్వం త్రోసిపుచ్చింది. పురావస్తు శాఖాధికారి పదవి ఖాళీ అయి నపుడు, ఆ పదవిని సంస్కృత కళాశాల అధ్యక్షుపదవిని ఒక్కరే నిర్వహింపవచ్చునన్న ప్రతిపాదనకు కూడ ఇట్టి గతే పట్టింది. అప్పు

టికే రాజరాజవర్మ పరిపాలనాదక్షత, పండితునిగా కీర్తి దక్షిణ భారతమంతా వ్యాపించింది. కాని పదవిలోవున్న దివానుగారి అనుగ్రహం అతి ముఖ్యం. తిరువనంతపురానికి కృష్ణస్వామిరావు దివాను అయినపుడు రాజరాజవర్మ యోగ్యత గుర్తింపబడింది. మహారాజా కళాశాలలో దేశభాషల అధ్యయనశాఖాధ్యక్షుడుగ రాజరాజవర్మ నియమితుడయ్యాడు. 1899. వ. సంవత్సరంలో రాజరాజవర్మ సంస్కృత కళాశాల బాధ్యతల్ని గణపతి శాస్త్రికి అప్పగించి తాను నూతన పదవిని స్వీకరించాడు.

మహాపండితుడైన రాజరాజవర్మకు ఈ క్రొత్తపదవి అనేక నూతన అంశాలను ప్రవేశపెట్టడానికి అవకాశం కల్పించింది. ఉన్నత విద్యాప్రణాళికలో భారతీయ భాషల స్థానం ఏమాత్రం సంతృప్తికరంగా లేనట్లు ఆయన గ్రహించాడు. పాఠ్యాంశాల ప్రణాళిక సక్రమంగా లేదు. పాఠ్య పుస్తకాలు అసంతృప్తికరంగా ఉండినవి. దేశభాషా తరగతుల పట్ల విద్యార్థులు ఉపేక్షాభావాన్ని ప్రదర్శించేవారు. ఈ పరిస్థితుల్లో రాజరాజవర్మ చేసిన సేవ అతి ముఖ్యం, చిరస్మరణీయం.సంస్మరణీయమైనది. రాజరాజవర్మ ఉపలబ్ధమైన వాటినుండి మేల్తరమైన పుస్తకాల్ని ఎంపిక చేసి, క్రొత్త పుస్తకాల్ని వ్రాయించి, పాఠ్యప్రణాళికను సవరింపచేశాడు. ఎఫ్. ఏ; బి. ఏ., తరగతి విద్యార్థులకు అనేక పాఠాల్ని తానే బోధించేవాడు. అవసరానికి అనువైన క్రొత్త ఛందో వ్యాకరణాలంకార గ్రంథాలను తానే రచించాడు. విద్యార్థులకు శిక్షణ నివ్వడంలో తన సహాధ్యాపకులకు మార్గదర్శిగ ఉండేవాడు, ఆయన ప్రియతమ శిష్యులైన సాహిత్య పంచణ్ణాన్, పి. కె. నారాయణపిళ్లై వంటి కొందరే ఆయన సహాధ్యాపకులు. రాజరాజవర్మ రచించిన కొన్ని ముఖ్య గ్రంథాల్ని గురించి తరువాత చర్చించుకొందాం.

### భారతీయ భాషోద్ధారకుడు :

విశ్వవిద్యాలయ విద్యాప్రణాళికలో దేశభాషలకు అప్పట్లో ద్వితీయ స్థానమే ఉండేది. ప్రథమ భాషగా, అత్యంత ముఖ్యమైన

పాఠ్యభాగంగా ఇంగ్లీషు చదవాలి. ఆంగ్ల భాషాధ్యయనం పట్ల విద్యార్థులు కూడా ప్రత్యేక శ్రద్ధను చూపేవారు. తమ సొంత భాషల ప్రస్తావన వచ్చేసరికి సామాన్యంగ విద్యార్థుల్లో నిర్లక్ష్య భావమే పొడచూపేది. ఈ అపవాదాన్ని సంపూర్ణంగా విద్యార్థులపైనే మోపలేం. ముందే పేర్కొన్నట్లు అనేక కారణాల సమైక్య ప్రభావమే యిది. విశ్వవిద్యాలయాలలో దేశభాషల కున్న ద్వితీయ స్థానాన్ని తొలగించాలనే ఉద్యమం బయలుదేరింది. అనతికాలంలోనే ఆ ఉద్యమం ఫలించి పరిస్థితి త్వరలో మారింది. రాజరాజవర్మ కాలంలోనే విశ్వవిద్యాలయ స్థాయిలో మళయాళ భాషాధ్యయనానికి సముచిత స్థానం కల్పించబడింది. ఈ విద్వాంసుని మహా విద్వత్తు సాటిలేని దూరదృష్టి, అకుంఠిత కార్యదీక్ష ఈ విషయంలో మార్పును తేవడానికి కారణాలు. భారతీయ భాషల గుర్తింపుకై పత్రికల్లో, వేదికల మీదనేకాక, విశ్వవిద్యాలయపు విభిన్న విద్యా సంఘాలతో పోరాడాడు. స్వాతంత్ర్యానంతరం మన భాషల స్థాయి మారింది గనుక, ఆ రోజుల్లో వాటి స్థానాన్ని గ్రహించటానికి కొంత భావన, ఊహ అవసరం.

విద్యావేత్తగా, విద్యా ప్రణాళికా రచయితగా, క్రాంత దర్శిగా అధ్యాపకుడిగా ఆ రోజుల్లో రాజరాజవర్మను మించిన వారు లేరు. పి. అనంతన్ పిళ్లై, పి. కె. నారాయణపిళ్లైవంటి అతని విద్యార్థులు అనేకులు అతని బోధనా విధానాన్ని గొప్పగా మెచ్చుకున్నారు. తెలివి తేటలుగల విద్యార్థు లాయన తరగతుల్లో మంత్ర ముగ్ధులా కూర్చుండేవారు. సామాన్య విద్యార్థులకు కూడ ఆయన తరగతులు ఆసక్తిదాయకంగ ఉండేవి. భాషాతరగతుల్లో విద్యార్థులు నిద్రపోవటమో లేక మరొక విధంగా కాలం గడపటమో సర్వసాధారణం. ఒక ప్రసిద్ధ పూర్వ విద్యార్థి తంపురాన్ తరగతిలో తన అనుభవానిలా పేర్కొన్నాడు :

“బి. ఏ. తరగతిలో చేరడానికి నేను తిరువనంతపురం వెళ్ళాను. ఎప్పటిలా మళయాళ భాషా తరగతిలో నిద్రపోవ

టమో లేక సొంత జాబుల్ని వ్రాసుకోవడమో చేయవచ్చుననుకున్నాను. అప్పుడే వేదిక మీద ఒక ఆజానుబాహువున్నట్లు గుర్తించి ఆశ్చర్యపడ్డాను. ఆయన మాటలు అర్థవంతాలై, మాధుర్యోపేతాలై నన్ను ముగ్ధుణ్ణి చేశాయి. ఆ ఆచార్యుడు సుప్రసిద్ధ కేరళపాణిని అని, ఆచార్య తంపురాన్ అని ఆ తరువాత నాకు తెలియవచ్చింది. ఆ తరువాతి రెండేండ్లు నేను వారి తరగతులో నా పద్ధతుల్ని మార్చుకొన్నాను. వారి తరగతుల్లో నా అనుభవం ఉత్సాహభరితమైనది.''

ఉద్యోగధర్మ నిర్వహణలో తంపురాన్ నిష్కర్షమైన వాడన్నది లోకు లెరిగిన సత్యం. పాఠ ప్రవచనబోధనావిధానాన్ని పరిశీలించట మన్నవే ఆయన దీక్ష. మళయాళ సమాజంలో సాంస్కృతిక కార్యకలాపాలను నిర్వహించడానికి విద్యార్థుల్ని ప్రోత్సహించేవాడు. కళాశాల విద్యార్థులు, సుప్రసిద్ధ విద్వాంసులు, ఇరువర్గాలవారూ ఉపన్యాసాలిచ్చి, చర్చల్లో పాల్గొనేవారు. ఆ రోజుల్లో చర్చావేదికలు, గోష్ఠులు అనే పదాలు వ్యవహార రూఢాలు కాకున్నా, ఆ భావనమాత్ర ముండేది. తంపురాన్ ఇటువంటి సమావేశాలకు తప్పక హాజరయి, తుదివరకు ఉండేవాడు. తంపురాన్ ఉనికి విద్యార్థులకు అధిక ప్రోత్సాహకరంగ ఉండేది. వారిలో భాష కవులు, రచయితలు ఉండేవారు.

సుబోధన, సుగ్రహణమన్న ఇవి రెండూ ఒకదాని కొకటి లంకె. మళయాళ భాషలో ఉత్తమ ఉపాధ్యాయుల్లో రాజరాజ వర్మ ఒకడైనట్లే, ఆ భాషలో ఉత్తమ విద్యార్థిగ పరిగణింపదగిన వ్యక్తి కూడ అతడే. జీవితాంతం విద్యను సముపార్జించాలి అన్నది అతని అభిప్రాయం. ఆరంభంలో మళయాళాన్ని నిరాదరించి సంస్కృత భాషకే ఆయన రచనా వ్యాసంగం అంకితమైనా, జీవితావసానంలో ఇరవై అయిదేండ్లు మళయాళంలోనే ఆయన అధిక రచనలు చేసేలా పరిస్థితులు మారాయి. కాని సంస్కృతాంగ్లాలే

ఆయన పరిజ్ఞానానికి మూలంగా, ప్రేరకంగా కొనసాగాయి. ఆయన అనుదినం మహాభారతాన్ని, భగవద్గీతని పఠించేవాడు. జ్యోతిశ్శాస్త్రంలో తన పరిశోధనల్ని కొనసాగించేవాడు. సాహిత్యపరమైన అలంకారాది శాస్త్ర విషయాలకు ఆయన తరచుగా సంస్కృతాంగ్ల గ్రంథాల్ని ఉపయోగించేవాడు. ఆధునిక మళయాళ వాఙ్మయాన్ని సుసంపన్నం చేయదలంచిన వారెవరికైనా అపారమైన ఆంగ్ల వాఙ్మయ పరిచయం అత్యంత ప్రయోజనకారి అని ఆయన గట్టి నమ్మకం. షేక్స్పియర్ నాటకాలు, ఫ్రాయిడ్స వ్యాసాలు, మెకాలే రచించిన ఇంగ్లాండు చరిత్ర, థాకరే, స్కాటుల నవలలు, షోపెన్‌హార్ "విస్‌డమ్ ఆఫ్ లైఫ్" అనే గ్రంథాల ప్రసక్తి ఆయన డైరీలలో కనిపిస్తుంది. ఈ గ్రంథస్థ విషయాల్ని ఆయన తరచు ప్రశంసించేవాడు.

అవకాశమున్నపుడంతా ఇతర పండితులతో ఆసక్తికరమైన భాషా సాహిత్య సంబంధ సమస్యల్ని చర్చించేవాడు. "కేరళ పాణినీయము" అనే ప్రఖ్యాత మళయాళ వ్యాకరణాన్ని రచించే సందర్భంలో రాజరాజవర్మ తాను తయారుచేసిన ధాతుమూల పట్టికను మహాకవి కుఞ్ఞికుట్టన్ తంపురాన్‌కు చూపి ఆయన అభిప్రాయాల్ని తెలిసికొన్నాడు. తురవూర్ నారాయణశాస్త్రిగారు తరచు ఈయన కవితను అనుశీలించేవాడు. ఇదంతా ఆయన వినమ్రతను, తన మాతృభాషలో ఉత్తమ రచనల్ని వెలువరించాలనే కోరికను వ్యక్తపరుస్తాయి. ఆయన రచనలన్నీ ఆయన ఉట్టి పండితుడు మాత్రమే కాడు అన్న విషయాన్ని వెల్లడిస్తాయి. నాటకాల్ని రచించి, వాటిలో నటించడం ఆయనకత్యంత ప్రీతిదాయకం. నిర్విరామ పరిశోధనా క్లేశాన్నుండి విరామం పొందడానికి సన్నిహిత స్నేహితులకి, పరిచితులకి కాలక్షేపంగ ఉండటానికే ఆయన అనేక సంస్కృత నాటకాల్ని మళయాళంలోనికి అనువదించాడు.

## అధ్యాయము - 4

# ఉద్యోగంలో ఉన్నత దశ

రాజరాజవర్మ నిర్వహించిన అధ్యాపక వృత్తి క్రింది సోపానంలో ఆరంభించి ఇరవై ఏండ్లలో శిఖరాగ్రాన్నందుకొన్నది. ఆయన ఉద్యోగం చేసిన పూర్తికాలం ఇరవై యెనిమిదేండ్లు మాత్రమే. ఆచార్య పదవి పాశ్చాత్యులకు మాత్రమే నిర్దిష్టమై ఉండిన కాలంలో, ఫస్ట్ గ్రేడ్ కళాశాలలో ఆచార్యుడుగ నియుక్తుడు కావడం, అందునా నిరాదరింపబడుతున్న భారతీయ భాషా శాఖకు చెందిన వ్యక్తి ఆచార్యపదవిని చేపట్టడం అన్నది అపూర్వమైన విషయం. ఈ అసామాన్యమైన గౌరవం రాజరాజవర్మకు సహజంగానే లభించింది. 1910. వ. సంవత్సరం సంస్కృత ద్రావిడ భాషలకే మొట్టమొదటి ఆచార్యుడుగ ఆయన నియమితుడయ్యాడు. ఆ వార్త తెలిసిన కేరళవర్మ ఎంతో ఆనందించి, తన మేనల్లుని అభినందిస్తూ తంతిని పంపాడు. ఆ తంతి వార్తను అందుకొన్న రాజరాజవర్మ ఆ అభినందనల్ని అపురూపంగ దాచుకొన్నాడు. శ్రేయోభిలాషులు, ఆప్తులు, మిత్రులు అభినందనల వర్షాన్ని కురిపించారు. కుటుంబ సభ్యు లందరూ సంతోషార్ణవంలో మునిగి తేలారు.

1910-1915 వరకు రాజరాజవర్మ ఆచార్యుడుగ ఉండిన అయిదేండ్ల కాలం సాఫీగ కొనసాగలేదు. కళాశాల పాలక వర్గ సమావేశాలప్పుడు ప్రొఫెసరులైన యూరపు దేశస్థులకు, తంపురానుకు ఏకవాక్యం కుదిరేది కాదు. సంస్కృత భాష కొక ట్యూటరును, మళయాళ భాష కొక ట్యూటరును విడివిడిగా ఇద్దర్ని నియమించాలన్నది రాజరాజవర్మ అభిమతం. ఈ నియామకాలు కూడదని విదేశీయులు ప్రతిఘటించారు. అయినా అంతిమ

విజయం రాజరాజవర్మకే దక్కింది. తత్ఫలితంగ సుప్రసిద్ధ పండితులైన నందియార్ వీట్టిల్ పరమేశ్వర పిళ్లై, ఆతూర్ కృష్ణ పిషారొడి తిరువనంతపురంలోని మహారాజా కళాశాలలో ఆచార్యులుగ నియమితులయ్యారు. వృత్తికి అంకితమైన ఇటువంటి విద్వాంసులైన ఉపాధ్యాయులు ప్రతిభావంతులైన అనేక విద్యార్థులు మళయాళ భాషలో ప్రత్యేక కృషి చేయడానికి ప్రేరకులయ్యారు. తద్వారా ఆ శాఖ సామాన్య స్థాయి పెరిగింది.

విదేశీయ ప్రొఫెసరుల, భారతీయ ప్రొఫెసరుల వేతనాలలో తేడా లుండేవి. తెల్లదొరలైన ప్రొఫెసర్లకు రూ. 750/- భారతీయ ఆచార్యులకు రూ. 450/- నెలసరి జీతాలు. ఈ తేడాను రూపుమాప మూడేండ్లపాటు ప్రతినిధులు సంప్రతించారు. ఆ రోజుల్లో యూరోపియనులను మాత్రమే కళాశాల ప్రిన్సిపాలు పదవిలో నియమిస్తుండేవారు. 1913. వ. సంవత్సరం రాజరాజవర్మను ఎనిమిది రోజులు తాత్కాలిక ప్రిన్సిపాలుగ నియమించడం ఘనకార్యంగా పరిగణింపబడింది. 1916. వ. సంవత్సరంలో ఏడు మాసాలు, 1918 వ సంవత్సరం మూడు మాసాలు రాజరాజవర్మ తాత్కాలిక ప్రిన్సిపాలుగ వ్యవహరించాడు. ఇది ఆయనకు లభించిన ద్వితీయావకాశం.

***సంస్కరణాభిలాష :***

మదరాసు విశ్వవిద్యాలయంలో భారతీయ భాషల స్థాయి, వాటిని చిన్న చూపుతో చూచే విధానం రాజరాజవర్మకు అసంతృప్తిని కలిగించాయి. ఈ నిర్లక్ష్య విధానాన్ని అవకాశం లభించినపుడంతా జంకుగొంకులు లేకుండ ఖండించేవాడు. 1914. వ. సంవత్సరంలో రాజరాజవర్మ కళాశాల వర్ధంతి ఉత్సవానికి అధ్యక్షత వహించాడు. తన అధ్యక్షోపన్యాసాన్ని అతి జాగ్రత్తతో ఆంగ్లంలో వ్రాసి, ముద్రించి ఆ ప్రతుల్ని సెనెట్, సిండికేట్, అకడమిక్ సభ్యులకు, తదితర విశ్వవిద్యాలయ సంబంధిత విద్యా

సంస్థలకి పంపాడు. మదరాసు విశ్వవిద్యాలయంలో దేశభాషను నిర్బంధ పాఠ్యభాగంగా తొలగించడానికి చేసిన ప్రయత్నాన్ని ఖండించే రాజరాజవర్మ ఉపన్యాసంలోని కొన్ని భాగాలు క్రింద ఉద్ధరింపబడ్డాయి.

'......దక్షిణాది ప్రాంతీయ భాషల్లో జరిపే ఉన్నత స్థాయి పరీక్షలకు అనువైన పాఠ్య పుస్తకాలు, కనీసం వచనంలో నైనా లేవు. అటువంటి పుస్తకాలు ఒకటీ రెండూ ఉన్నా అవి ఆంగ్ల సాహిత్యంలోని ఉత్తమోత్తమ గ్రంథాలతో ఏ మాత్రం పోల్చదగినవి కావు పాఠ్యపుస్తక ప్రణాళికా సంఘంవారు వివిధ పరీక్షలకు, ఉపలబ్ధ గ్రంథాలలో ఉత్తమమైన వాటిని పాఠ్య పుస్తకాలుగ ఎంపిక చేయకుండ, పరిస్థితిని మరికొంత విషమం చేస్తున్నారు. ఈ నియమిత పాఠ్యపుస్తకాల్ని ఆధునిక బోధనా పద్ధతుల్ని, విమర్శ సూత్రాల్ని అన్వయించి పండితులు బోధించడం లేదు. ఆ కారణంగా విద్యార్థుల్లో ఈ పాఠాలంటే ఏవగింపు కలగడం సహజమే. అంతేకాకుండా విశ్వవిద్యాలయ పరీక్షాధికారులు అర్థరహితమైన చిక్కు ప్రశ్నల నడిగి ఈ పాఠాల అనాదరణకు కారకు లవుతున్నారు.''

అప్పటి విద్యావ్యవస్థని ఇంతకన్న యథార్థంగా ఎవ్వరూ విశ్లేషింపలేరు. దీనివల్ల దేశభాషలకు అపజయం కలిగినట్లు తెల్లమవుతున్నది. జాతీయ సంస్కృతీ ప్రచారాన్ని ప్రబోధించే వారి ప్రశ్నను పూర్తిగ పునః పరిశీలించాలన్న అలజడిని రేకెత్తించారు. ఈ సమస్యను గురించి రాజరాజవర్మ ఇలా కొనసాగించాడు.

''దేశ భాషను తొలగించడం కాదు. దానిని సవరించాలన్నదే వారి కోరిక. ఈ భాషల స్థాయి దిగజారిపోవడం ఆ భాషల దోషం కాదు. వాటి అధ్యయనానికి న్యాయం చేకూరలేదు. అనేక కళాశాలల్లో దేశభాషల ఉత్తమ శిక్షణకు తగిన ఏర్పాటులు ఎన్నడూ చేయబడలేదు. నామమాత్ర జీతానికి ఉపా

ధ్యాయులుగ ఉండ సమ్మతించి సగం పస్తులతో కాలం గడిపే పాతకాలపు పండితులకే భాషాబోధనని అప్పగిస్తున్నారు. అందు వలన విద్యార్థుల దృష్టిలో ఈ భాషలకి సరియైన గుర్తింపు లేదు. ఈ కారణాలచేత వారు ఈ భాషల్ని ఈసడిస్తున్నారు... ఈ విధంగా ఈ భాషల ఎడల గౌరవం సన్నగిల్లి విపత్కర స్థితి తీసుకు రాబడింది. కనుక యీ బోధన విధానంలోని లోపాల్ని సవ రించాలే కాని ఈ భాషాధ్యయనాన్నే విసర్జించడం సరికాదు.'' ఆ అధ్యక్షోపన్యాసంలోనే తన మాతృభాషాభివృద్ధిని గురించి ఇలా చెప్పాడు :

''మళయాళ భాషలోను, తదితర ప్రాంతీయ భాషల్లోను ఈ మధ్య వెలువడిన వచన సాహిత్యాన్ని పరికించండి. ఈ వచన గ్రంథాల సంఖ్య పెరగడానికి నిస్సందేహంగా విశ్వవిద్యాలయపు పరోక్ష కృషే కారణం. సాహిత్య విమర్శ, విజ్ఞానశాస్త్రం, ఇంకా ఇలాంటి ఆధునిక విషయాలను గూర్చిన గ్రంథాలు ప్రాంతీయ భాషల్లో విరివిగ వ్రాయబడటాన్ని పరిశీలించండి. ఆంగ్ల భాషలోనూ, మాతృభాషల్లోను సుశిక్షితులైన పట్టభద్రులు లేక పోతే ఇటువంటి కృషి ఎన్నటికీ సాధ్యం కాదు. ఇప్పటి ప్రాచ్య భాషల పరీక్షా ప్రణాళికలు పండితుల్లో పేరుకొనివున్న మౌఢ్యాన్ని రూపుమాపి వారికి ఆధునిక దృక్పథాన్ని అలవరచడానికి వుద్దేశింప బడ్డాయి. వారి ఛాందస భావాలతో కిడును కలిగించకుండ అడ్డు కొనడానికి ఈ నూతన ప్రణాళికలు రూపొందినట్లు సువ్యక్త మవుతుంది...''

''ఆంగ్ల భాష నుండి దేశభాషలకు, దేశ భాషల నుండి ఆంగ్లానికి అనువదించుట అన్నదానిని ఈ నూతన విశ్వవిద్యాలయ విద్యా ప్రణాళికలో అన్ని తరగతులకు నిర్బంధ పాఠ్యాంశంగ ఎందుకు పెట్టలేదో విదితం కావడం లేదు!...''

సమాజంలో ప్రపంచ జ్ఞానం కాని, ఆంగ్ల భాషా పరిచయం

గాని లేని అధిక సంఖ్యాక ప్రజానీకాన్ని, సంప్రదాయాల నుండి తొలగి, జాతీయతను విస్మరించి, పాశ్చాత్య విద్యను నేర్చామన్న గర్విష్ఠులైన అల్ప సంఖ్యాకుల్ని పరస్పర—విభిన్నమైన ఈ రెండు వర్గాల వారిని ఆదరించడంలోని ఆపదల్ని ఆయన ఎత్తి చూపాడు. ఈ ఇరుతెగల వారి సమైక్యం ఆవశ్యకమని సూచించాడు.

ఆ అధ్యక్షోపన్యాసంలో తుదిమాటగ ఇలా అన్నాడు:

"ప్రాంతీయ భాషలే ప్రజల భాషలుగ సర్వదా వర్తిస్తాయి. కాబట్టి భారతదేశంలో నాగరికతను పెంపొందిస్తున్న ఆంగ్ల విద్యతో సమస్థాయికి ఈ భాషల్ని పెంపొందించడానికి దోహదం చేయాలి. ఇంగ్లీషు విద్యనభ్యసించిన సగటు భారతీయునికి ఉండే విదేశీ సంస్కృతి విజ్ఞానాల్లో కొంతభాగమైనా ఇవ్వగల స్థాయికి ప్రాంతీయ భాషల్ని పెంపొందించడం ఎంతైనా అవసరం. ఈ బృహత్కృషిని మన పట్టభద్రులు తప్ప ఇంకెవరు చేయగలరు? ఈ కార్యాన్ని సాధించడానికి వారు దేశభాషల్లోను, విషయ పరిజ్ఞానంలోను సుశిక్షితులై వుండాలి కదా?"

అధ్యక్షోపన్యాసంలో విద్యా విధానంలోని తదితర అంశాల్ని గురించి సుసంపన్నమూ, ప్రాచీనమూ అయిన భారతీయ సంస్కృతిని తీర్చిదిద్దడంలో సంస్కృత భాష వహించిన పాత్ర వివరించబడినది. దక్షిణాదిలోని పలువురు విద్యావేత్తలు ఈ అధ్యక్షోపన్యాసంలోని విషయ స్పష్టతకు, దూరదృష్టికి, భారతీయ భాషల అభివృద్ధికి ఇచ్చిన ప్రోత్సాహానికి రాజరాజవర్మను ప్రశంసించారు. భారతీయ భాషల్లో బి. ఏ. ఆనర్స్ విభాగాన్ని ప్రారంభించవలసినదిగా ఆయన ప్రబోధించాడు. మరొక సందర్భంలో మద్రాసు విశ్వవిద్యాలయంలోని లోపాల్ని పరిహరించి తిరువనంతపురంలో మరొక ప్రత్యేక విశ్వవిద్యాలయాన్ని నెలకొల్పమని సూచించాడు. ఆ నూతన విశ్వవిద్యాలయం ఆ రాష్ట్ర ప్రజ అవసరాల్ని, ఆదర్శాల్ని తీర్చగలదన్నాడు. అరవై యేండ్ల క్రితం అటువంటి

ఆలోచన గొంతెమ్మ కోరికగా తోచి ఉండవచ్చు. కాని ఆ తరు వాతి కాలంలో జరిగిన సంఘటనలు ఆయన చెప్పింది ఎంత సత్యమో నిరూపించాయి. 1935. వ. సంవత్సరం తిరువనంతపురంలో, మహా రాజా కళాశాలలో మళయాళభాషలో బి. ఏ. ఆనర్స్ విభాగాన్ని ఆరంభించారు. 1937 వ సంవత్సరం తిరువనంతపుర విశ్వవిద్యాల యాన్ని స్థాపించారు. అదే తరువాత కేరళ విశ్వవిద్యాలయంగా రూపొందింది.

## విద్యా విషయిక వ్యాసంగాలు :

ఆచార్యుడిగా (ప్రొఫెసరుగా) సంస్కృత ద్రావిడ భాషా విభాగాల ప్రధాన ఆచార్యుడిగా నిర్వహింపవలసిన బాధ్యతలతో పాటు రాజరాజవర్మ భాషాప్రణాళికలకి, సామాన్య విద్యా విధా నానికి సంబంధించిన బాధ్యతల్ని కూడ అంగీకరింపవలసివచ్చింది. పాఠ్యపుస్తక ప్రణాళికా సంఘసభ్యుడిగా, తిరువనంతపుర రాష్ట్ర పాఠ్యపుస్తక సంఘసభ్యుడిగా ఆయన గణనీయమైన సేవను చేశాడు. ఈ రెండు సంఘాలలోనూ ఆయన విశేషమైన కార్యదీక్షతగల సభ్యుడు. కనుక ఈ బాధ్యత తప్పలేదు. అధికార, అనధికార సభ్యులతో కూడిన భాషాపరిష్కరణ సంఘాల్లో కూడ ఆయన సభ్యుడు. విశిష్ట విద్వాంసుల ఉపన్యాసాల్ని ఏర్పాటుచేసే బహిరం గోపన్యాస సంఘానికి ఆయన కార్యదర్శి. మరికొన్ని సంఘాల్లో ఆయన అధ్యక్షుడుగ ఉండి, వాటి కార్యక్రమాల్ని నడపింపవలసి ఉండేది.

ఇన్ని వ్యాపకాలున్నా గ్రంథ రచనకు కూడా వ్యవధిని కల్పించుకొనేవాడు. ఆయన జీవితంలో ఈ దశ మిక్కిలి సార్థక మైనదని చెప్పవచ్చు. ఉద్యోగంలో వున్న కడపటి ఎనిమిదేండ్లలో, పని ఒత్తిడి అధికంగా ఉండేది. ఆ సమయంలోనే రాజరాజవర్మ ''సాహిత్యసహ్యం, మళయాళ శాకుంతలం (అభిజ్ఞాన శాకుంతలానికి సరళ మళయాళానువాదం) లఘుపాణినీయ ద్వితీయభాగం, మాళ

వికాగ్ని మిత్రం, చారుదత్తం, స్వప్నవాసవదత్త'' నాటకాల అను వాదాలతోపాటు పాఠశాలలకి వాచకాలను కూడ రచించాడు. ఆయన రచించిన బృహత్తర గ్రంథమైన కేరళ పాణినీయం (మళయాళ వ్యాకరణం) సంపూర్ణంగా పునఃపరిష్కృతమై 1917. వ. సంవత్సరంలో ప్రచురింపబడింది, ఈ గ్రంథాల్ని తరువాత వివరంగా పరిశీలించుదాం.

ఎనిమిదేండ్ల పరిమిత కాలంలో ఇన్ని గ్రంథాల రచనని ఆయన ఎలా చేయగలిగాడు ? ఇదొక మహాద్భుతంగా తోస్తుంది. ఆయన దినచర్య ఎటువంటిదో చూద్దాం.

ఉదయం 6, 6-30 గంటలకు నిద్ర లేచేవాడు. 8 గంటలకి ఒక కప్పు కోకోను సేవించేవాడు. 10 గంటలకు స్నానం. స్నానానంతరం పూజ, జపాల్ని విధిగ నిర్వహించేవాడు. విశేష దినాల్లోనే దేవాలయాన్ని దర్శించేవాడు. 11 గంటలకి భోజనం. నేలపై క్రిందపరచిన చాపపై పండుకొని, బిడ్డలతో కొంతసేపు కాలక్షేపం చేసేవాడు, నిద్రవస్తే ఒకటి, ఒకటిన్నర గంటలసేపు నిద్రించేవాడు. ఆ తరువాత ఫలమో, ఫలాహారమో ఆయనకు తినడానికి ఉండాలి. అల్పాహార సేవనానంతరం బల్లదగ్గర కూర్చుండి చదువడంగాని. వ్రాయడంగాని చేసేవాడు. 3-30 గంటలకు కాఫీ త్రాగేవాడు. కాఫీ త్రాగిన తర్వాత ఉత్తర ప్రత్యుత్తరాలతో కొంతకాలం గడిచేది. 5 గంటల ప్రాంతంలో గృహావరణలోనే నడిచేవాడు లేదా క్లబ్బుకు వెళ్ళి టెన్నిస్ ఆడేవాడు. చీకటిపడిన తరువాత గృహానికి వచ్చి స్నానం చేసేవాడు. పత్రికల్ని, గ్రంథాల్ని అప్పుడు చదివేవాడు. 8, 8-30 గంటల మధ్య రాత్రి భోజనం. భోజనానంతరం కుటుంబ సభ్యులతో గడిపేవాడు. పదిగంటల తరువాతనే నిద్రించేవాడు. సెలవు దినాల్లో ఆయన కార్యక్రమం పైన పేర్కొన్నట్లుండేది.

కళాశాలలో వున్న రోజులలో స్నాన భోజనాలు తొమ్మిది

గంటల లోపుననే ముగిసేవి. కళాశాలలోనే అల్పాహారాన్ని తీసుకొనేవాడు. కళాశాల నుండి తిన్నగ యూనియన్ క్లబ్బుకు వెళ్ళి, టెన్నిస్, పేకాటల్ని ఆడి చీకటిపడిన తరువాత ఇంటిని చేరుకొనేవాడు,

*కుటుంబ జీవనం:*

తంపురాన్ సంసారం ఆదర్శ సంసారం. భార్యా బిడ్డల్ని అధిక శ్రద్ధతో, అనురాగంతో ఆదరించేవాడు. వారి జీవితాల్ని సుఖమయంగా, సంతోషదాయకంగ చేయడానికి సర్వశక్తులా పాటుపడేవాడు. ఆయనకు ఏడుగురు కూతుళ్ళు, ఆరుగురు కొడుకులు. ఈ పదముగ్గురిలో ప్రస్తుతం నలుగురు పుత్రికలు, ఇద్దరు పుత్రులు మాత్రమే జీవించివున్నారు. కేంద్ర మంత్రి శ్రీ జి. రవీంద్రవర్మ తల్లి జీవించివున్న వారిలో ఒకతె. 1918. వ. సంవత్సరపు డైరీ నుండి గ్రహింపబడిన యీ క్రింది భాగం ఈ మహాపండితుని మానవతా దృక్పథాన్ని ప్రదర్శిస్తుంది :

"సాయంత్రం నా భార్యను, కొమరితలను నక్షత్రశాలకు తీసుకువెళ్లాను. ఆ మిద్దె పైనుండి పడమటి సముద్రం, తూర్పు కొండలు చూడడానికి అత్యద్భుతంగా ఉన్నాయి. చంద్రోదయం, సూర్యాస్తమయం, బృహస్పతి, శని, వాటిని పరివేష్టించివున్న చంద్రుల్ని, మరికొన్ని నక్షత్ర జంటల్ని చూచాం. బిడ్డలీ దృశ్యాల్ని చూచి ఆశ్చర్యపడ్డారు."

ఒకమారు చిన్న కూతురు తన అన్న చదువుతున్న కళాశాలని చూడడానికి కుతూహలం పడింది. కనుక ఒక రోజు ఆచార్యవర్యుడు ఆ బిడ్డను తనవెంట తీసుకొనివెళ్ళి, తన తరగతిలో ఒక గంట కూచోడానికి అనుమతించాడు. కవి, ఆచార్యుడు అయిన అతని మృదు స్వభావం ఈ సన్నివేశాన్నిబట్టి అవగాహన అవుతుంది. 1915. వ. సంవత్సరంలో రాజరాజవర్మ పూజ్యగురువర్యుడు

మేనమామ అయిన కేరళవర్మ దివంగతులయ్యాడు. ఈ సంఘటన రాజరాజవర్మకు అశనిపాతమయినది.

కాలం ఆగదు. దినాలు భారంగ గడుస్తున్నవి. ఆయన తీరిక లేనప్పుడు కూడ సాంసారిక విధ్యుక్త ధర్మాల్ని ఉపేక్షింప లేదు. 1918. వ. సంవత్సరంలో తన కుమారుడు రాఘవవర్మ యొక్క వివాహాన్ని జరిపించాడు.

మహా విద్వాంసుడు రాజరాజవర్మ మరణం హఠాత్తుగ సంభవించింది. జలదోషంతో ఆరంభించి, అతిసార వ్యాధితో ఆయన ఆరోగ్యం వికటించింది. మూడు రోజుల్లోనే తంపురాన్ బొత్తిగా బలహీనుడయ్యాడు. 103° డిగ్రీల జ్వరం, సన్నిపాతం. ఒకమారు డాక్టరు వచ్చినపుడు, "డాక్టరుగారూ! నాకేమీ పొద్దుపోవడం లేదు. జ్వరమూ తగ్గడం లేదు. మీ రోగి అసహనంతో విరాగి అవుతున్నాడు." అని అన్నాడు. ఇటువంటి ఛలోక్తులు ఆయనకు సహజం, డాక్టరు వెళ్ళిన తరువాత ఆయన తన పుత్రికను గీత గోవిందాన్ని గానం చేయమని కోరాడు. తర్వాత తాను వ్రాయా లనుకున్న క్రొత్త నాటకం-దాని కథా ప్రణాళిక గురించి ఆమెను వ్రాసుకోమని కోరాడు. చివర కామె ఆయన్ను విశ్రమింప ప్రార్థేయపడింది. జ్వరం హెచ్చు తగ్గులుగ వుండి, చివర కది టైఫాయిడ్ జ్వరంగ మారింది. డాక్టర్ల కృషి నిష్ప్రయోజన మయినది. మంచం పట్టిన రెండు వారాలకు 1918. వ. సంవత్సరం జూన్ 18. వ. తేది రాజరాజవర్మ పరమపదించాడు. ఆయన మరణానికి కుటుంబ సభ్యులేకాక కేరళరాష్ట్ర ప్రజలందరూ దుర్భర దుఃఖ సముద్రంలో మునిగారు.

## అధ్యాయము - 5

# భాషా సాహిత్య విమర్శ గ్రంథాలు

రాజరాజవర్మ బహుముఖప్రజ్ఞ, ఆయన రచించిన కొన్ని గ్రంథాలు పూర్వాధ్యాయంలో ప్రసక్తాను ప్రసక్తంగా ప్రస్తావింపబడ్డాయి. మళయాళ వాఙ్మయంలో ఆయన రచించిన నలభై కి పై బడిన సాహిత్య గ్రంథాల స్థానాన్ని సమగ్రంగా పరిశీలించవలసి వున్నది. ఆయన గ్రంథాల్ని మూడు వర్గాలుగ విభజించి పరిశీలించడం సమంజసం. ఈ విభాగాల్లో మొదటిదైన భాషాశాస్త్ర, సాహిత్యాలకు సంబంధించిన గ్రంథాలు ఈ అధ్యాయంలో చర్చింపబడతాయి.

మళయాళంలో కావ్యభాషకు ఎనిమిది శతాబ్దాల చరిత్ర వున్నది. వ్యావహారిక భాషగా అది అనేక శతాబ్దాల పూర్వం నుండి ఉండివుండాలి. అయితే క్రమబద్ధమైన విద్యాభ్యాసానికి అవసరమైన, మూలసాధనాలైన వ్యాకరణాలు గాని, నిఘంటువులు గాని మళయాళంలో 18.వ. శతాబ్ది వరకు రూపొందలేదు. 18. వ. శతాబ్దంలో కూడ ఈ విషయంగా జరిగిన కృషి స్వల్పం. 19. వ. శతాబ్దపు మధ్యభాగంలో కొంత పరిగణింపదగిన కృషి జరిగిందని చెప్పవచ్చు. ఇలా పేర్కొనటం వల్ల 14. వ. శతాబ్దంలోని "మణిప్రవాళా"న్ని, సంస్కృతంలో రచించిన "లీలాతిలకము" అనే గ్రంథాన్ని గుర్తింపలేదని భావించకూడదు. లీలాతిలకంలో మళయాళభాషా ఛందోవ్యాకరణాలకు సంబంధించిన అనేక అమూల్యాంశాలు ప్రస్తావించబడ్డాయి.

కనుక మళయాళ భాష వ్యాకరణ, పదకోశాల చరిత్ర 250 సంవత్సరాల కన్న తక్కువ కాల పరిమితి కలది. శాస్త్రీయ

దృక్పథంతో మళయాళ భాషాధ్యయనం విదేశీయ విద్వాంసుల రాకతో ఆరంభమయింది. ఇంత పురోభివృద్ధిని చెందిన మళయాళ భాషకు యూరోపియనుల ఆగమనం వరకు మూల పరికరాలు లేవనడం పలువురికి ఆశ్చర్యాన్ని కలిగించవచ్చు.

కాని దీన్ని తీవ్రంగా ఆలోచిస్తే, ఆశ్చర్యపడవలసిందేమీ లేదు. ఒక భాషను మాతృభాషగ అభ్యసించడమన్నది, మరొక భాషాధ్యయనం కన్న భిన్నమైనది, పసిబిడ్డ తన మాతృభాషని అనాయాసంగ ప్రత్యేకమైన ప్రయత్నం లేకుండానే, కేవలం వినడం వల్ల, అనుకరించడం వల్ల అలవరచుకుంటుంది. మాతృభాషలోని ధ్వనుల సముదాయాన్ని సామాన్య పదజాలాన్ని, వాక్యనిర్మాణాన్ని సహజంగా ఎవరినీ అడగకుండానే బిడ్డ నేర్చుకోవడం జరుగుతుంది. పసిబిడ్డలా కాక ఒక వయోజనుడు మరొక భాషను ప్రయత్నపూర్వకంగానే నేర్చుకోవాలి. అతడు హేతుదృష్టితో గుణదోష విచక్షణతో, సవిమర్శకంగా ఆ భాషను నేర్చుకో అభిలషిస్తాడు. భాషా నిర్మాణాన్ని శీఘ్రంగా గ్రహించడానికి తోడ్పడేది వ్యాకరణం. అటువంటి వ్యాకరణాన్ని బోధించే విద్యా ప్రణాళికనే అతడు కోరుకుంటాడు. విదేశీయులు వ్యాపారం నిమిత్తమైతేనేం, మత ప్రచారానికయితేనేం కేరళకు వచ్చినపుడు సామాన్య ప్రజానీకంతో వ్యవహారాన్ని జరపవలసివచ్చింది. కేరళీయులతో వ్యవహరించడానికి మళయాళ భాషను వారు నేర్చుకోవలసిన ఆవశ్యకత ఏర్పడింది. కనుక వారు వారికి, వారి అనంతరం వచ్చేవారికి ఉపయుక్తంగా ముఖ్యమైన మళయాళ పదాల్ని, వాటికి పర్యాయ పదాలైన లాటిన్, పోర్చుగీస్, ఇంగ్లీషు పదాల్ని, అవసరమైన మళయాళ వ్యాకరణాంశాల్ని సంతరించి గ్రంథాల్ని తయారుచేశారు. ఆ తరువాత ప్రజ్ఞగల విద్యార్థులు కొందరు ఈ నూతన భాషా వ్యాకరణాన్ని అవగాహన చేసుకొని, యీ ప్రాథమిక కృషికి మెరుగులు దిద్దారు.

ఇంతవరకు మళయాళ భాషలో వున్న వైయాకరణు లంద రిలో రాజరాజవర్మ విశిష్టుడుగ పరిగణింపబడుతున్నాడు. ఆయన రచించిన కేరళపాణినీయాన్ని ప్రామాణిక గ్రంథంగ అందరూ అంగీక రించారు. రాజరాజవర్మ మళయాళ వ్యాకరణానికి చేసిన సేవని పరిగణించడానికి, కేరళపాణినీయ ప్రచురణకు పూర్వం ఉన్న మళ యాళ వ్యాకరణ గ్రంథాల్ని గూర్చి తెలుసుకోవడం అవసరం.

## విదేశ విద్వాంసుల రచనలు:

1. రాబర్ట్ డ్రుమ్మాండ్ ... గ్రామర్ ఆఫ్ మలబార్ ల్యాంగ్వేజ్ (1799)
2. ఎఫ్. స్ప్రింగ్ ... అవుట్‌లైన్స్ ఆఫ్ ఎ గ్రామర్ ఆఫ్ ది మళ యాళం ల్యాంగ్వేజ్ (1839)
3. జోసఫ్ పీట్ ... ఎ గ్రామర్ ఆఫ్ ది మళ యాళం ల్యాంగ్వేజ్ (1854)
4. గుండర్ట్ (& గర్త్ వైట్) ... కాటికిజమ్ ఆఫ్ మళయాళం ల్యాంగ్వేజ్ (1860)
5. గుండర్ట్ ... మళయాళ భాషా వ్యాక రణం. (1868)
6. ఎల్. జె. ఫ్రోహ్న్మెయర్ (L. J. Frohnmeyer) ... ఎ ప్రోగ్రసివ్ గ్రామర్ ఆఫ్ మళయాళం ఫర్ యూరప్పి యన్స్ (1889)

## కేరళ పండితుల గ్రంథాలు:

1. అజ్ఞాత కర్త ... లీలాతిలకం (14. వ. శతాబ్ది)
2. రెళ. జార్జిమాతన్ ... మళయాళ్మయుతె వ్యాకరణం (1863)

3. పాచుమూత్తాతు ... కేరళభాషా వ్యాకరణం (1876)

4. కోవుణ్ణి నెడుఙ్ఙాడి ... కేరళ కౌముది (1878)

పైన పేర్కొన్న వ్యాకరణ గ్రంథాలలో డా॥ గుండర్ట్‌గారి మళయాళ భాషా వ్యాకరణం (1868), రెవ. జార్జిమాతన్ రచించిన మళయాళ్మయుటె వ్యాకరణం (1863) అన్న రెండు వ్యాకరణాలు పండితాదరణని పొందినవి. డా॥ గుండర్ట్ వ్యాకరణం తప్ప ప్రథమ వర్గంలోని తక్కిన వ్యాకరణాలన్నీ యూరోపియనుల కొరకు ఉద్దేశింపబడినవి. మళయాళభాషా మెలకువల్ని విదేశీయులకు పరిచయం చేసే ప్రాథమిక వ్యాకరణాలవి భాషల నిర్మాణాన్ని విశ్లేషించడానికి పాశ్చాత్య పద్ధతులు, లక్షణాలతో సుపరిచతులైన యూరపియను భాషాశాస్త్రవేత్తలు. విభిన్న భాషా కుటుంబానికి చెందిన మళయాళానికి కూడ ఆ పద్ధతుల్నే అన్వయించి విశదీకరింప ప్రయత్నించారు. అలాగే స్వదేశీయ విద్వాంసులకు కూడ ప్రసిద్ధ సంస్కృత వ్యాకరణాలతో మాత్రమే పరిచయమున్నది. కనుక వారూ మళయాళానికి వ్యాకరణం వ్రాయ ఉద్యుక్తులైనపుడు రచనా విధానంలో, పరిభాషాగ్రహణంలో సంస్కృత వ్యాకరణాలచే ప్రభావితులై వాటిని అధికంగా అనుకరించారు. ఈ సందర్భంలో బిషప్ రాబర్ట్ కాల్డ్‌వెల్ రచించిన "ద్రావిడభాషల తులనాత్మక వ్యాకరణం" (A Comparative Grammar of Dravidian or South Indian Family of Languages, 1856) అన్న గ్రంథాన్ని పేర్కొనక తప్పదు. ద్రావిడభాషా కుటుంబానికి చెందిన భాషలు సంస్కృతంతోగాని, ఇండో-ఆర్యను భాషా కుటుంబానికి చెందిన ఇతర ఏ భాషలతోగాని జన్యజనక సంబంధం లేదని నిస్సందేహంగా నిరూపించిన వాడు కాల్డ్‌వెల్ పండితుడు. అందువలన ద్రావిడ భాషల నిర్మాణాన్ని పరిశీలిస్తున్నపుడు, పాశ్చాత్య భాషా శాస్త్ర పద్ధతుల్నే అవలంబించినా, ఇండో-యూరోపియను భాషల

నిర్మాణానికన్న వీటి నిర్మాణము భిన్నమన్న విషయాన్ని విస్మరించ లేదు

## కేరళ పాణినియము :

దక్షిణాది భాషల పండితులు కాల్డ్ వెల్ గ్రంథం యొక్క విలువను గుర్తించడానికి కొంతకాలం పట్టినా, ఆ గ్రంథ ప్రచురణానంతరం రచింపబడిన ముఖ్యమైన తమిళ, తెలుగు, కన్నడ, మళయాళ భాషా వ్యాకరణాలు ఎంతో ప్రయోజనాన్ని పొందాయి. డా॥ గుండర్ట్‌కు డా॥ కాల్డ్ వెల్‌కు భాషాపరమైన అభిప్రాయ భేదాలున్నప్పటికి మళయాళ భాషా వ్యాకరణ రచనలో మాత్రం పరస్పరం సహకరించారు. ఈ ఇద్దరు పండితుల గ్రంథాల్ని, వారి అభిప్రాయాల్ని, రెవ. జార్జిమాతన్ వ్యాకరణాన్ని కూడ రాజరాజ వర్మ సునిశితంగా పరిశీలించాడు. కాని సంస్కృత సంప్రదాయంలో పెరిగిన రాజరాజవర్మ సంస్కృత లక్షణానుసారం మళయాళానికి వ్యాకరణాన్ని వ్రాయడానికి మొదట కృషిచేశాడు. విద్యారంగంలో ప్రవేశించిన తొలిదశలోనే యీ వ్యాకరణాన్ని రచించి "కేరళ పాణినీయ"మని (1896) నామకరణం చేశాడు. కేరళ పాణినీయమని పేరు పెట్టడంలోని అంతరార్థ మేమిటి? సంస్కృత భాషలో పాణిని సుప్రసిద్ధ వైయాకరణుడన్నది జగమెరిగిన సత్యం. "పాణిని, పాణినీయం" అన్న పదద్వయం భారతీయ భాషల్లో "వ్యాకరణం" అన్న అర్థాన్ని సూచించునంతగ ప్రఖ్యాతిని పొందాయి. అందుచేత "కేరళ పాణినీయం అంటే పాణినీయ సంప్రదాయంలో రచింపబడిన కేరళభాషా వ్యాకరణమని తెలుసుకోవాలి. పాణినీయ సంప్రదాయంలో సూత్ర-వృత్తి పద్ధతి ప్రధానమైనది. ధారణ కనుకూలమైన సంగ్రహ నిర్వచనాలే సూత్రాలు. అయితే ప్రతి సూత్రాన్ని వివరించే వ్యాఖ్యాన పూర్వమైన వృత్తి వుంటే కాని సూత్రాలు స్ఫురింపవు. కేరళ పాణినీయం రెండు దశాబ్దాల పాటు విశేష ప్రచారంలో ఉండింది. మళయాళ భాషలో

ప్రావీణ్యాన్ని సంపాదింప ఆశించే ఆధునిక విద్యార్థులకి తద్భిన్నమైన వ్యాకరణం అవసరమని రచయిత గుర్తించాడు. మళయాళ భాషా సాహిత్యాలు ప్రత్యేక పాఠ్యాంశాలుగా ఉండే బి. ఏ. తరగతులకు బోధిస్తున్నపుడే వాస్తవాన్ని ఆయన గ్రహించాడు. మళయాళ వ్యాకరణాన్ని బోధించడానికి తయారుచేసుకొన్న ఉపన్యాససారమే పరిష్కృత నూతన వ్యాకరణంగా 1917.వ. సంవత్సరంలో ప్రచురింపబడింది. ఇంచుమించు పూర్వరూపాన్ని కోల్పోయిన ఈ పరిష్కృత వ్యాకరణానికి "కేరళ పాణినీయ" మనే ఆ పాత పేరునే పెట్టడానికి ఇష్టపడలేదు. కాని ఆయన స్నేహబృందం ఆ పేరుకున్న ప్రసిద్ధిని విడిచిపెట్ట సమ్మతించలేదు. కనుక ఈ నూతన వ్యాకరణానికి కూడ ఆ పేరునే పెట్టారు. అరవై యేండ్లుగా ఈ వ్యాకరణం ప్రామాణికంగా పరిగణింపబడుతోంది. భవిష్యత్తులో కేరళపాణినీయాన్ని మించగల వ్యాకరణం వచ్చే అవకాశాలు తక్కువ. ఈ వ్యాకరణమెంతో ప్రసిద్ధిని పొందింది. ఈ వ్యాకరణకర్తను "కేరళపాణిని"గ వ్యవహరిస్తున్నారు. వారి శిష్యుడైన పి. అనంతన్ పిళ్ళై రచించిన రాజరాజవర్మ సంగ్రహ జీవిత చరిత్రకు కూడ ఈ పేరే పెట్టారు.

రాజరాజవర్మ సంస్కృత భాషలో ఉద్దండ పండితుడు. ఆయనకు తమిళ భాషలో మంచి ప్రవేశముంది. కర్ణాటకాంధ్ర భాషలతోనూ కొద్ది పరిచయం మాత్రమున్నది. రాజరాజవర్మ ఈ ద్రావిడ భాషల్లో ప్రామాణికమైన వ్యాకరణాల్ని సంప్రతించాడు. కాల్డ్‌వెల్, గుండర్ట్‌ల రచనల్ని తరచు సంప్రతించే వాడని ప్రత్యేకంగా పేర్కొనక్కరలేదు. ఈ పండితులందరిలో కాల్డ్‌వెల్ పట్ల ఆయనకు అమిత గౌరవం. రాజరాజవర్మ గ్రంథాల్ని పరిశీలిస్తే కాల్డ్‌వెల్‌తో ఏకీభవించలేని సందర్భాలలో వ్యాకులపడినట్లు స్పష్ట

---

1. రాజరాజవర్మ సేవను గుర్తిస్తూ తిరువనంతపురంలోని తమ భవనానికి "కేరళపాణిని భవనం" అని నామకరణం చేయడం సముచితమని ద్రావిడభాషా సమితి తీర్మానించింది.

మవుతుంది. అయితే కాల్డ్‌వెల్ పొరబడినట్లు రాజరాజవర్మకు నమ్మకం కుదిరినపుడు ఆ విదేశీయ విద్వాంసుని వ్యతిరేకించడానికి ఎంతమాత్రం వెనుకాడలేదు. పూర్వగ్రంథానికి "కేరళపాణినీయం" అన్న పేరు సార్థకమైనట్లే యీ నూతన కూర్పుకు "కేరళ కాల్డ్‌వెలీయం" అన్న పేరు సమంజసంగా ఉండేది. ఎందుచేతనంటే ఈ గ్రంథంలో అనేక భాగాలు కాల్డ్‌వెల్‌ను ఆధారంగా చేసుకొని రచింపబడ్డాయి. రాజరాజవర్మ పాణినిని గాని, కాల్డ్‌వెల్‌ను గాని గ్రుడ్డిగ అనుకరింపలేదు. కనుక యీ రెండు పేర్లు అనుచితాలే. రాజరాజవర్మ ప్రాచీన సంప్రదాయాన్ని, ఆధునిక పద్ధతుల్ని అద్భుతంగా మేళవించాడు. కాబట్టే ఈ గ్రంథం కేరళ వ్యాకరణ వాఙ్మయంలో ఒక నూతన శకాన్ని సృష్టించింది.

రాజరాజవర్మ ఈ నూతన కూర్పులో పూర్వగ్రంథంలో వున్న సూత్రాల్ని సంపూర్ణంగా పరిహరించి, వాటి స్థానంలో వ్యాఖ్యా నిరపేక్షాలైన సులభ పద్యాల్ని రచించాడు. వివరణ అవసరమైన స్థలాల్లో తానే వివరణలు వ్రాశాడు. సముచితమని తోచిన సంస్కృత పారిభాషిక పదాల్ని అధికంగా వాడాడు. నెన్నయ్యాడి చేసినట్లు సంస్కృత వ్యాకరణాన్ని కాక సంస్కృత పారిభాషిక పదాల్ని మాత్రమే గ్రహించాడు. సంస్కృతం కన్న తమిళ పదాలు మేలని తోచినపుడు తమిళ పదాలను కొన్నింటిని ఉపయోగించాడు. ఏమైనా విషయ విశ్లేషణలో, రచనా విధానంలో భారతీయ లక్షణాలనే వాడినా, వాటిపై పాశ్చాత్య ముద్ర కనిపిస్తుంటుంది. కాని గుండర్ట్, మాతన్‌లలా మళయాళ వ్యాకరణానికి పాశ్చాత్య రంగును పులుమలేదు.

ఈ వ్యాకరణంలో కొన్ని లోపాలున్నాయి. కొన్ని పొరపాట్లు దొర్లాయి. ఈ నూతన గ్రంథం వెలువడిన తరువాత రాజరాజవర్మ ఒక్క సంవత్సరం మాత్రమే జీవించాడు. ఆయన మరి కొంతకాలం జీవించి వున్నట్లయితే నిశ్చయంగా దీనిని సవరించి

ఉండేవాడే. కేరళపాణినీయంలో విశ్లేషణ పద్ధతి లేదు. గుండర్ట్ వ్యాకరణంలో ఉన్నన్ని అధికసంఖ్యాకమైన ప్రాచీన కావ్యప్రయోగాలు కూడా ఇందులో లేవు. రెవ. మాతన్‌లాగ వ్యావహారిక భాషారూపాలపై శ్రద్ధను చూపలేదు. తమిళ, మళయాళ భాషా సామ్యాల్ని పోల్చిచూపిన ఇందులోని సుదీర్ఘమైన పీఠిక అమూల్యమైనది. ఈ పీఠికలో మళయాళ భాష స్వతంత్ర భాషగ ఆవిర్భవించడాన్ని, తమిళ భాషతో దానికి గల సంబంధాన్ని రచయిత చర్చించాడు.

ఆయన పూర్వవిద్యార్థి, సహోద్యోగి అయిన పి. కె. నారాయణపిళ్ళై (ఈయన తరువాత తిరువనంతపుర రాష్ట్ర హైకోర్టుకు న్యాయమూర్తిగ నియమింపబడ్డాడు) ఈ నూతన వ్యాకరణానికి ఉపోద్ఘాతాన్ని రచించాడు. అందులో ఈ గ్రంథ ప్రాశస్త్యాన్ని ఇలా పేర్కొన్నాడు: ''అక్షర సమామ్నాయం మొదలు రూప నిష్పత్తి వరకు గల ప్రతి వ్యాకరణాంశంలో ఆయన నిశిత పరిశీలన, సిద్ధాంతీకరణ మెచ్చదగినవి. ఆయన అనేక నూతనాంశాల్ని పేర్కొన్నాడు. అనేక విషయాల్ని నూతన విధానంలో వివరించాడు. సంస్కృతాన్ని అనుసరించి పూర్వవ్యాకర్తలు భాషాభాగాలు మూడని పేర్కొంటే, యీయన అవి ఐదు అని చెప్పడం ఆయన మౌలిక ప్రజ్ఞను సూచిస్తుంది...పాణినిది చారిత్రక దృష్టి కాదు; అతనిది తార్కిక దృష్టి. పాణిని మృతభాషను వ్యాకరించినందు వల్ల ఎలా చెప్పినా సమంజసంగానే ఉండవచ్చు. దినదినాభివృద్ధిని చెందుతున్న మళయాళం వంటి జీవద్భాషకు సంస్కృతం వంటి పునాది తగునా? అందువలన ఈ కూర్పులో ప్రాథమిక సూత్రాలు సంపూర్ణంగా మార్చబడ్డాయి. ఇందులోను తార్కిక దృక్పథం సంపూర్ణంగా పరిత్యజింపబడలేదు. కాని చారిత్రాత్మక పరిణామానికి పై చేయిగ కనిపిస్తుంది...మన భాష కిట్టి అమూల్య గ్రంథాన్ని సమకూర్చినందుకు మనం గర్వించాలి. మళయాళ భాషా

వ్యవహర్తలందరూ ఈ ఉత్తమ గ్రంథ ప్రచురణ రచయితకు ఋణ పడి వున్నారు.''

దీనికి పూర్వ వ్యాకరణానికి రాజరాజవర్మ మేనమామయిన కేరళవర్మ ఉపోద్ఘాతాన్ని రచించాడు. ఈ రెండు వ్యాకరణాలు మేనమామకే అంకితాలు. కొన్ని పొరపాటులు, లోపాలువున్నా మళయాళ వ్యాకరణాలన్నింటిలో కేరళపాణినీయం ఉత్తమమైనది. ఆరు దశాబ్దాల తరువాత కూడ దీనిని మించిన గ్రంథరాజము రాలేదు,

## ఇతర వ్యాకరణ గ్రంథములు

ప్రథమ కేరళ పాణినీయ రచనకు, ద్వితీయ కేరళపాణినీయ రచనకు మధ్య ఇరవై యొక్క సంవత్సరాల వ్యవధి ఉండింది. ఈ కాలమంతా రాజరాజవర్మ మళయాళ వ్యాకరణాన్ని గురించి ఆలోచిస్తూనే వున్నాడు. కేరళపాణినీయం నిస్సందేహంగ పండితుల కుద్దేశింపబడింది; కాబట్టి విద్యార్థులకు సరళ వ్యాకరణం అవసరం, కనుక తంపురాన్ ఈ అంతరాన్ని పూరింప సమకట్టాడు.

### శబ్దశోధిని :

మూడు మాసాల తీవ్ర కృషి ఫలితమే 1902. వ. సంవత్స రంలో ప్రచురితమైన శబ్దశోధిని గ్రంథం. పాఠశాల విద్యార్థులకు కేరళ పాణినీయం కొరకరానికొయ్య కావడంచేత, వారి ఉప యోగార్థం రచయిత యీ సులభ వ్యాకరణాన్ని రచించాడు. సామాన్య ఉదాహరణలతో, సుగ్రాహ్యమైన పద్ధతిలో రచించడం వల్ల శబ్దశోధిని బహుళ ప్రచారాన్ని పొందింది. ధ్వనులు, సంధి, వాక్యం, పదవ్యుత్పత్తులు అని 175 విభాగాలుగా ఇది విభజింప బడింది. కొన్ని ప్రయోజనకరమైన మార్పులతో, చేర్పులతో కేరళ పాణినీయం సారాంశమే ఇది అని రచయితే పేర్కొ న్నాడు.

### ప్రథమ వ్యాకరణం:

శబ్దశోధిని ప్రచురణానంతరం కూడా క్రింది తరగతులకు వ్యాకరణాల ఆవశ్యకతను రాజరాజవర్మ గుర్తించాడు. డైరెక్టర్ ఆఫ్ పబ్లిక్ ఇన్ స్ట్రక్షనుగారు కూడ ఇటువంటి సూచనలను చేశారు. అందువలన రాజరాజవర్మ మరి రెండు వ్యాకరణాలను తయారు చేశాడు. మొదటిది "ప్రథమ వ్యాకరణం" (1906). దాని పేరు సూచించినట్లే యీ వ్యాకరణం ప్రాథమిక విద్యాదశకు ఉద్దేశింప బడింది.

### మధ్యమ వ్యాకరణం:

1907 వ సంవత్సరంలో మాధ్యమిక పాఠశాలల విద్యార్థుల కొరకు అదే పద్ధతిలో "మధ్యమ వ్యాకరణా"న్ని రచించాడు. ఈ రెండు పుస్తకాలలో మళయాళ వ్యాకరణ మూల లక్షణాలు స్పష్టంగా విశదీకరింపబడ్డాయి. ఈ వ్యాకరణ ద్వయం విద్యార్థులు సులభంగా గ్రహించడానికి, ఉపాధ్యాయులు స్పష్టంగా బోధించ డానికి, ఇరువర్గాల వారికి ప్రయోజనకరంగా ఉంది. ప్రచురించిన ఒక్క మాసంలోనే పునర్ముద్రణ జరగటం, ఒక్క ఏడాదిలో తృతీయ ముద్రణ జరగడం ఈ వ్యాకరణ పుస్తకపు ప్రాచుర్యాన్ని వెల్లడిస్తుంది.

డా॥ గుండర్ట్ వ్యాకరణం పండితులకు ఉపయుక్తమైనదే. కాని అందులో విషయం క్రమబద్ధంగా సమకూర్చబడలేదు. పారి భాషిక పదాలు అవకతవకగా ఉన్నాయి. అంతకు పూర్వం వ్రాయ బడిన కేరళ పాణినీయంలో కూడ ప్రాచీన పద్ధతులకు సంబంధించిన కొన్ని లోపాలున్నాయి. శబ్దశోధిని కొంతవరకు ఇంగ్లీషు వ్యాకర ణాల పద్ధతిని అనుసరించింది. మధ్యమ వ్యాకరణం విశ్లేషణ పద్ధ తిలో, ప్రథమ వ్యాకరణం సంయోజన పద్ధతిలో రచింపబడ్డాయి. కేరళపాణిని మళయాళ ప్రజలకు మళయాళ వ్యాకరణాన్ని సుక రంగా స్పష్టంగా ప్రదర్శించాడు.

### మణి దీపిక :

మళయాళ వాఙ్మయంలో కొన్ని శాఖలైన చంపువు, ఆట కథా మొదలైన సాహిత్య ప్రక్రియల్ని చక్కగా గ్రహించి, ఆనందించడానికి సంస్కృత భాషా పరిజ్ఞానం చాల అవసరం. కనుక మళయాళ భాషా విద్వాంసులకు సంస్కృత వ్యాకరణ పరిచయం ఉండాలి. అయితే అందరు పండితులు పాణినీయాన్ని పఠించి కృతార్థులు కావడం సాధ్యం కాదు అందువలన మళయాళంలో సరళమైన సంస్కృత వ్యాకరణ మొకటి అవసరమని చాలకాలంగా గుర్తింపబడింది. రాజరాజవర్మ యీ విషయాన్ని ముందే గ్రహించి, అటువంటి వ్యాకరణాన్ని రచింప సంకల్పించాడు. అయినా 1908. వ. సంవత్సరంలోనే ఆయన సంకల్పం నెరవేరింది. మూడు మాసాలు రేయింబవళ్ళు కృషి చేసి ''మణి దీపిక'' అన్న పుస్తకాన్ని ప్రచురించాడు. ''మణి ప్రవాళం'' అన్న పదంలో లాగే ఇక్కడ ''మణి'' అంటే సంస్కృతమని భావం. దీని వ్రాత ప్రతిని వైయాకరణి తురవూర్ నారాయణ శాస్త్రిగళ్ సరి చూచారు. కృతిని స్వీకరించిన కేరళవర్మ ఆమోదించారు. ఈ గ్రంథం ప్రచురణమైనప్పటి నుండి మళయాళ విద్యార్థులు సంస్కృత వ్యాకరణంలోని సాధక బాధకాల్ని గ్రహింపగలిగారు.

### లఘు పాణినీయం :

''మణిదీపిక'' రచనానంతరం, నాలుగైదు మాసాల పిదప రాజరాజవర్మ పాణిని అడుగుజాడల్లో సంస్కృతంలో సులభ వ్యాకరణం వ్రాయ ప్రారంభించాడు. ఈ ముఖ్యమైన పనికి కేరళవర్మ ప్రోత్సహించి, అనేక సలహాల నిచ్చినట్లు రాజరాజవర్మ డైరీలవల్ల వెల్లడవుతున్నది. అయిదు మాసాల వ్యవధిలో 1910. వ. సంవత్సరం ఈ వ్యాకరణ రచన పూర్తయినది. సంస్కృతంలో వున్న ఉపోద్ఘాతం, ఇంగ్లీషులో వున్న ఉపోద్ఘాతం రెండు ఈ వ్యాకర్త

యొక్క రచనోద్దేశాన్ని తెలుపుతున్నాయి. అందుండి కొంత భాగం ఈ క్రింద గ్రహింపబడింది :

"ప్రాచీన కాలంలో లాగే ఇప్పటికీ పాణినికి సముద్దైన వ్యాకర్త లేడనడం వాస్తవం. సూత్ర పరిపక్వత, విషయ సమగ్రత అష్టాధ్యాయిని అధ్యయనం చేయ సంకల్పించిన ఎవరికైనా క్లిష్టతను కల్పిస్తవి. వాటి అన్వయానికి వ్యవధి కోరవడిన వారికి, వాటిని అర్థం చేసుకోవాలన్న పట్టుదల లేనివారికి ఆ సూత్రాలు కొరుకుడు పడేవి కావు. భాష్యకారులు పతంజలి, వార్తికాకారులు, కారికాకర్తల వంటి వారు వారి మాటల మబ్బుల్లో పాణినీయార్థాన్ని మరుగుపరచి మరింత క్లిష్టతని ఆపాదించారు. అయినప్పటికి పాణిని అసమాన సూత్రాలనే ఆధారంగా చేసికొని, అందులోని లక్షణాల్ని సువభం చేసి, ఆధునిక పద్ధతుల్లో వాటిని వివరిస్తూ, పాణినీయాన్ని, మహాకావ్య ప్రయోగాల్ని సుబోధమొనర్పగల ఒక ప్రాథమిక సంస్కృత వ్యాకరణాన్ని వ్రాయడం సాధ్యమయితే, అటువంటి ప్రయత్నం చేయ తగ్గదని ఆది నుండి నాకు తోచింది."

అటువంటి ప్రయత్నం చేయతగ్గదని అనుభవం స్పష్టపరచింది. విదేశాలలోను, భారతదేశమంతటా వున్న విద్యార్థుల, విద్వాంసుల అభిప్రాయం కూడా యిదే. జర్మనీ దేశంలోని బాన్ విశ్వవిద్యాలయంలో పనిచేస్తున్న ఆచార్య జాకొబి (Prof. Jacobi) రాజరాజవర్మకిలా వ్రాశారు : "నిస్సందేహంగా మీ గ్రంథం సర్వాతిశాయి. వచ్చే వేసవిలో మా విద్యార్థులకు పాణినీయాన్ని నేర్పేటప్పుడు 'సిద్ధాంత కౌముది'ని కాక మీ గ్రంథాన్ని ఉపయోగించాలని నిర్ణయించుకున్నాను." బొంబాయి విల్సన్ కాలేజిలోని, ఆచార్య యం. యం. బాద్కమర్ (Prof. M. M. Bhadkamar) ఇలా వ్రాశారు :

"ఈ పుస్తకపు రచనా ప్రణాళిక అత్యుత్తమంగా ఉంది.

ఇది సంస్కృత వ్యాకరణ పరిజ్ఞానాన్ని స్పష్టంగా తెలపడానికి మాత్రమే కాక, సంస్కృత భాషా పరిచయాన్ని, పాణిని హృదయాన్ని విద్యార్థికి ప్రదర్శించడానికి ప్రయత్నిస్తున్నది.''

పూనాలోని దక్కను కాలేజికి చెందిన ఆచార్య ఆర్. సి. రెనడే (Prof. R. C. Ranade) ఆ గ్రంథాన్ని ఇలా ప్రశంసించారు: ''మీ గ్రంథాన్ని చదువుతున్నపుడు, పాణిని సూత్రాల్ని క్రొత్త మూసలో పోసి పునర్నిర్మించిన విధానం నన్ను చకితుణ్ణి చేసింది...సంస్కృత భాష మీవంటి విద్వాంసుల హస్తాలలో ''మృత భాష'' అన్న కళంకాన్ని పోగొట్టుకుంటుందని మీ రమ్యమైన ఉపోద్ఘాతం స్పష్టంగా నిరూపిస్తుంది. చదువరులు సంస్కృతానికి నవజీవం ప్రసాదింపబడినట్లు భావిస్తారు.''

అష్టాధ్యాయిలోని 2978 సూత్రాలు ఇందులో 1959 సూత్రాలకు పరిమితం చేయబడ్డాయి. ''వైదిక ఖండము'', ''స్వర ఖండము''లే కాక భాషను గూర్చి ప్రాక్పశ్చిమ ప్రామాణికాకారుల చర్చలతో కూడిన లఘు ప్రాణినీయపు ద్వితీయ భాగాన్ని కూడ గ్రంథకర్త 1912. లో ప్రచురించాడు.

## *సాహిత్య శాస్త్రం:*

వ్యాకరణాలు, నిఘంటువులు భాషాధ్యయనానికి ముఖ్య సాధనాలు. ఇంతవరకు రాజరాజవర్మ వ్యాకరణ రంగంలో చేసిన పరిశ్రమను, సేవను పరిశీలించాం. బెయిలీ (Bailey) గుండర్టుల నిఘంటువులకు మిన్నగా ఒక నిఘంటువును సంతరించాలన్న కోరిక రాజరాజవర్మకు ప్రగాఢంగా ఉండేది. కాని యితర వ్యాపకాల్లో నిమగ్నుడైన ఆయనకు తగినంత సమయం చిక్కలేదు. రచనాకళని అభ్యసించే వారికి, సాహిత్యంలో ఆసక్తిగల విద్యార్థులకి ఉపయుక్తంగా కొన్ని ప్రాథమిక పుస్తకాల్ని రచించడం నిఘంటువు కన్న ముఖ్యమని, అవసరమని ఆయన భావించాడు. పద్య రచనకు అవసరమైనవి ఛందోఽలంకార శాస్త్రాలు. ఈ శాస్త్రానికి

సంబంధించి ప్రాక్పశ్చిమ లక్షణకర్తలు చెప్పాకోదగిన గ్రంథాల్ని రచించి వున్నారు. ఈ రెండు విధాలైన లక్షణ గ్రంథాల్ని ఆయన క్షుణ్ణంగ చదివి వున్నాడు. ఈ రెండింటిలోని ఉత్తమమైన దానిని గ్రహించి సమన్వయ పరచాలన్నది ఆయన సంకల్పం. మళయాళపు పద్యగద్యాల రెండింటికి సమానమైన సాధన సంపత్తి, స్వరూపం ఉండనక్కరలేదని కూడ ఆయన భావించాడు. మళయాళంలో వచనానికంటే పద్యానికి దీర్ఘకాలిక చరిత్ర ఉన్నది. అందుచేత పద్యరచనలో సంస్కృత అలంకారాల ఛందస్సులవైపు అధికంగా మొగ్గు చూపడం సమంజసమే. అయితే దీనివలన అందులోని వస్తువుకు ఎట్టి భంగమూ కలుగకూడదు. మళయాళ వచనం స్వరూపంలోను, విషయ గ్రహణంలోను కొంతవరకు ఇంగ్లీషు వచనం వైపు మొగ్గు చూపడం వలన ప్రయోజనాన్ని పొందుతుంది. రాజరాజవర్మ రచించిన "భాషా భూషణము", "వృత్త మంజరి", "సాహిత్యసహ్యము" అన్న మూడు గ్రంథాలలో ఈ దృక్పథాన్ని స్పష్టంగా చూడవచ్చు.

## భాషా భూషణం :

1902. వ. సంవత్సరంలో ప్రచురింపబడిన భాషాభూషణం పద్యాల స్వరూప స్వభావాల్ని, అభ్యాసాన్ని తెలిపే లఘుకావ్యం. భూషణమంటే అలంకారం. ధరించేది. భాషాభూషణం పీఠికలో గ్రంథకర్త ఆ గ్రంథ రచనారంభాన్ని సవిస్తరంగా వివరించాడు. సముచితమైన భాగాలు (మళయాళంలోనికి అనూదితమైనవి) గ్రహించి ఇక్కడ ఉట్టంకింప బడ్డాయి :

"తిరువనంతపుర కళాశాలలో భారతీయ భాషల బోధనా బాధ్యతను నాకప్పగించినపుడు అలంకారశాస్త్రంలో పాఠ్యపుస్తకాలు లేకపోవడాన్ని గుర్తించాను. మద్రాసు విశ్వవిద్యాలయపు ప్రశ్నా పత్రాలకు సంతృప్తికరమైన సమాధానాలు వ్రాయాలంటే విద్యార్థులకు ఉన్నత ప్రమాణాలుండాలి. . .కనుక బి. ఏ.

తరగతి విద్యార్థులకి అలంకార శాస్త్రంలో కనీసం ప్రాథమిక సూత్ర పరిజ్ఞానమైనా ఉండాలని గ్రహించాను. మళయాళంలో తగిన బోధనా పరికరాలు లేనందున సంస్కృత లక్షణ గ్రంథాల సాహాయ్యంతో అలంకార శాస్త్రాన్ని బోధించ ఆరంభించాను. అయితే అది కూడ అవసరాన్ని తీర్చడానికి అసమగ్రమని కనుగొన్నాను...అందువలన బి. ఏ. తరగతుల కొరకు రెండేండ్లు (1900-1901) పరిశ్రమించి, ప్రామాణిక సంస్కృత గ్రంథాల నుండి కొన్ని భాగాలను ఎన్నుకున్నాను. వాటిని మళయాళంలోనికి అనువదించి బహు విషయ బహుళకమైన వ్యాఖ్యానాన్ని తయారు చేశాను. తదుపరి సాహిత్యాభిమానులు, స్నేహితులు, విద్యార్థులు అభ్యర్థించగా ఈ వ్యాఖ్యానాన్ని, వ్యాసాల్ని పునఃపరిశీలించి పుస్తక రూపంలో ప్రచురించాను.''

సంస్కృతంలో అలంకార శాస్త్రానికి సంబంధించిన ప్రధాన గ్రంథాల నన్నింటిని తాను సంప్రదించినట్లు, ఏ ఒక్క గ్రంథాన్నీ ఆధారం చేసుకోలేదని కూడ గ్రంథకర్త విశదీకరించాడు. సాధ్యమైనంతవరకు ప్రసిద్ధ మహాకావ్యాల నుండే లక్ష్యాల్ని ప్రదర్శించాడు. అలా వీలుకానప్పుడు ఆధునిక కృతుల్నే ఆధారం చేసుకోవలసి వచ్చేది. అనేక సందర్భాలలో తాను రచించిన పద్యాలనే ఉదాహరింపవలసి వచ్చేది. అటువంటప్పుడు అది తన స్వీయ కవిత అని స్పష్టంగా తెలిపేవాడు. ఈ గ్రంథాన్ని సాకల్యంగా వ్రాయలేకపోయానని రాజరాజవర్మ అంగీకరించాడు. ఈ గ్రంథాన్ని ఆరు ప్రకరణాలుగా విభజించాను. అవి, (1) అలంకారం (2) దోషం (3) గుణం (4) శబ్దార్థం (5) ధ్వని (6) గుణీభూత వ్యంగం. అలంకారాల్ని ''అతిశయం, సంశయం, శ్లేషం, వాస్తవం'' అని నాలుగు విభాగాలుగా వర్గీకరించడంలో ఈయన రుద్రటుని విధానాన్ని అనుసరించాడు.

మలి కూర్పులో ఈ గ్రంథాన్ని విస్తృత పరచవచ్చునని

గ్రంథకర్త ఆశించాడు. కాని 1910. వ. సంవత్సరం దీని ద్వితీయ ముద్రణం ప్రచురింపబడినా, పనుల ఒత్తిడివలన, తీరికలేక ఆయన దీనిలో చేర్చదలచిన వాటిని చేర్చలేకపోయాడు. ఆ తరువాత వచ్చిన విద్వాంసులు, ప్రత్యేకంగా ఇదే అంశంపై సాహిత్య భూషణమన్న పుస్తకాన్ని రచించిన కుట్టికృష్ణకుమారాన్ భాషా భూషణాన్ని ఆక్షేపించి, విమర్శించారు. అయితే 1968. వ. సంవత్సరంలో తన సంపాదకత్వంలో ప్రచురితమైన భాషాభూషణ ఎన్. బి. ఎస్. (N.B.S) కూర్పులో మారాన్ స్వయంగా తంబూరాన్ సాధించిన ఘనకార్యాల్ని ప్రశంసించాడు.

## వృత్త మంజరి:

పేరు సూచిస్తున్నట్లు వృత్తమంజరి ఛందస్సుకు సంబంధించిన గ్రంథం. (వృత్తం-ఛందస్సు). ఇది కూడ సాహిత్య విద్యార్థుల అవసరాల్ని తీర్చ ఉద్దేశింపబడిన గ్రంథం. మళయాళ కవులు సంస్కృత వృత్తాల్ని, దేశీయ వృత్తాల్ని యథేచ్ఛగా వాడడం అందరూ ఎరిగినదే. సంస్కృత ఛందస్సులోని వివిధ వృత్తాల నిర్వచనాలకు, ఉదాహరణలకు కొరతలేదు. అక్షర గుణ ఛందస్సుకు వృత్తరత్నాకరాన్ని, మాత్రా ఛందస్సుకు వృత్తరత్నావళిని రాజరాజవర్మ ఆధారంగా చేసికొని విషయాన్ని గ్రహించాడు. వృత్తమంజరిలోని లక్ష్య లక్షణాలు అత్యుత్తమాలు. అనేక సందర్భాలలో సుప్రసిద్ధ మళయాళ కావ్యాలనుండి ఉదాహరణలని గ్రహించాడు.

దేశీయ వృత్తాలకి మళయాళంలో లక్షణాలు లేవు. రాగం వైపు మొగ్గుచూపే ప్రసిద్ధ మళయాళ దేశీయ వృత్తాలకు స్వయంగా పరిశోధన చేసి లక్షణాన్ని నిర్ణయించవలసి వచ్చింది. ఛందశ్శాస్త్రం చాల క్లిష్టమైనది. కలవరపెట్టే రంగం అనడంలో సందేహం లేదు. కాని మార్గదర్శకుడుగా రాజరాజవర్మ కొంత దీన్ని సుగమంచేసి, పరిగణింపదగిన అభివృద్ధిని సాధించాడు కఠినమైన ఈ శాస్త్రాధ్యాయనానికి ఇంకా యెంతో కృషి అవసరమని ఒప్పుకోక తప్పదు.

అప్పన్ తంపురాన్, కుట్టి కృష్ణమూచార్, కె. కె. వాద్యార్ వంటి విద్వాంసులు రాజరాజవర్మ తరువాత ఈ శాస్త్ర గ్రంథాల్ని వ్రాయ ప్రయత్నించినా, వారూ కొంతవరకే కృతకృత్యులు కాగలిగారు. ఈనాటికీ మళయాళ ఛందశ్శాస్త్రంలో వృత్తమంజరి ఒక మైలురాయి.

## సాహిత్య సాహ్యం:

1911. వ. సంవత్సరంలో సాహిత్య సాహ్యం మొదటిసారి ప్రచురింపబడింది. ఇది వచన రచనలో నైపుణ్యాన్ని సాధింప దలంచిన వారికి మార్గ నిర్దేశక గ్రంథం. ఇంతకు పూర్వం సూచించి నట్లు మళయాళంలో పద్య వాఙ్మయం తరువాతనే వచన వాఙ్మయం ఆవిర్భవించి, పాశ్చాత్య సాహిత్యాల సంపర్కంతో పూర్తిగా వికసించింది. వచనానికి సహితం మళయాళ భాష వైదగ్ధ్యానికి, ఆలంకారికతకు సంస్కృత భాషనే ఆధారం చేసు కోవాలని కొందరు పండితులు భావించినా రాజరాజవర్మ మాత్రం తద్భిన్నంగా అభిప్రాయపడ్డాడు. మళయాళ భాష సంస్కృత భాషా శృంఖలాల నుండి విడివడి ఇంగ్లీషు మొదలైన ఇతర భాషల నుండి అనేక విషయాలను గ్రహించి పరిపక్వతను పొందవచ్చునని ఆయన భావించాడు. అయినా భాషా నుడికారంపై బాహ్యాంశాల ప్రభావం ఏమాత్రం ఉండకూడదని స్వచ్ఛమైన జాతీయతను ప్రద ర్శించాలన్న పట్టుదల ఆయనకు ఉండేది. ఈ లక్ష్యంతో అధి కోత్సాహంతో ఆయన సాహిత్య సాహ్యాన్ని రచించాడు. విషయ సేకరణకు, గ్రంథ రచనకు ఆయనకు అయిదు నెలలు మాత్రమే పట్టింది. వ్రాత ప్రతుల్ని తయారుచేసేటప్పుడు తన సహ అధ్యాప కుల, గురువైన కేరళవర్మల సలహాలను గ్రహించాడు. దీని వ్రాత ప్రతిని కొచ్చిన్‌లో మహా విద్వాంసుడైన అప్పన్ తంపురాన్‌కు

అనుశీలనార్థం పంపగా ఆయన అమూల్యమైన మున్నుడిని దానికి సమకూర్చారు.

అందరెరిగినట్లు సంస్కృతంలో పద్యానికే అగ్రస్థానం. వచనానికి ద్వితీయ స్థానం మాత్రమే. 19. వ. శతాబ్దపు మధ్య కాలం వరకు ఆధునిక భారతీయ భాషల్లోను పరిస్థితి ఇలాగే ఉండేది. కాని ఆ తరువాత గాలివాటం మారింది రాజరాజవర్మ వంటి గొప్ప దీర్ఘదర్శులు వచనానికి ఉజ్వల భవిష్యత్తును దర్శించారు. దేశ భాషల్లో వచనం సృజనాత్మకంగా, విజ్ఞానదాయకంగా వర్తించగలదని గుర్తించారు. కాని ఆయన కాలంలో వచనరచనలు సరియైన సూచనలుగాని సక్రమమైన నియమావళిగాని లేకుండానే విస్తరిల్లసాగాయి. అప్పటి వచన శైలి కృతకంగ, శబ్దాడంబరంతో, నియమరహితంగా అస్తవ్యస్తంగా ఉండేది. ఇటువంటి పరిస్థితుల్లో భావి రచయితలకు కొన్ని సూచనలివ్వడం అవసరమని ఆయన గ్రహించాడు. ఉత్తమ వచనరచనా లక్షణాలేవి? వచన రచనలో సామాన్యంగా కనుపించే లోపాలేమిటి? సృజనాత్మకమైన విమర్శనాత్మకమైన వచనంలో ఉండే విభిన్న ప్రక్రియ లేమిటి? ఈ ప్రశ్నల కన్నింటికి సమాధానాలు సాహిత్యసాహ్యంలో సక్రమంగ ప్రదర్శింపబడ్డాయి.

ప్రఖ్యాత విమర్శకుడు కుట్టిపుళ కృష్ణపిళ్లై సాహిత్యసాహ్యపు ఎన్. బి. యస్. ప్రతికి పీఠికను రచించాడు. అందులో ఆయన ఈ పుస్తకాన్ని గురించిన తన అభిప్రాయాన్ని వ్యక్తపరిచాడు. ఈ పుస్తకం మళయాళ భాషాధ్యయన విద్యార్థులకే కాక వచన రచయితలకందరకు ఉపయుక్తమైనది. వచనాన్ని అమోఘంగా ఇంపుగ సొంపుగా వ్రాయాలనుకున్న సిద్ధహస్తులైన రచయితలకు కూడ విలువైనది. పద్య రచనకన్న ఆస్వాదయోగ్యమైన వచనరచన చాల కష్టం. మంచి వచన రచన సూటిగా, సంక్షి

ష్టంగా ఉండాలి. ఛందో నిర్బంధం లేని వట్టి పదజాలం ఉత్తమ వచనం కాదు. సాహిత్య విలువ గల వచనం అసలే కాజాలదు.

ఈ గ్రంథం ప్రథమ భాగంలో రాజరాజవర్మ వచనాన్ని నాలుగు విభాగాలుగా విభజించాడు: ఆఖ్యానం; వర్ణనం; వివరణం; ఉపపాదనం (వివాదం) ప్రతి విభాగం యొక్క వైశిష్ట్యాన్ని సోదాహరణంగా విశదీకరించాడు. ద్వితీయ భాగంలో విస్పష్టమైన భావవ్యక్తీకరణ, భాషా నుడికారం, విరామ చిహ్నాల ఉపయోగం గురించిన వివరణ చాల ఆసక్తిదాయకంగ కొనసాగింది. గ్రంథాంతంలో సమకూర్చిన పదపట్టికలు ఈ గ్రంథం యొక్క విలువను ఇనుమడింపచేశాయి. ఇంగ్లీషు భాషకు ఫౌలర్ (Fowler) చేసిన సేవవంటి సేవను ఈ ఉత్తమ గ్రంథం ద్వారా మళయాళ భాషకు రాజరాజవర్మ చేశాడు.

## *అధ్యాయము 6*

# అనువాదాలు

రాజరాజవర్మ జీవించిన కాలం యాభైయారు సంవత్సరాలు మాత్రమే. ఈ జీవిత కాలాన్నంతా రెండు సమభాగాలుగా విభజించవచ్చు. ప్రథమార్థం తన జీవిత బృహత్కృషికి తన్నుతాను సంసిద్ధ పరచుకొనడంలో గడచిపోయింది. ద్వితీయార్థం ఔద్యోగిక కార్యక్రమాలతో, రచనా వ్యాసంగంతో, సాంసారిక బాధ్యతలతో, సామాజిక సంక్షేమ కలాపాలతో నిండిపోయింది. ఇంత స్వల్ప వ్యవధిలో ఇన్ని కార్యాల్ని ఎలా సాధించాడా అని ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. కుటుంబానికి, ఉద్యోగానికి సంబంధించిన సమస్యలు ఆయనకూ ఉండేవి. సమస్యలెదురై, మనస్సు వికలమైనపుడు సృజనాత్మక రచనల కుపక్రమించి తన వ్యథను విస్మరించేవాడు. చీకాకు పరిస్థితుల్లో ప్రయోజనకరమైన ఉత్తమ కార్యాలపై

ఎవరూ మనస్సును లగ్నం చేయలేరు. గంభీరాంశాల్ని గురించి గ్రంథాలు వ్యాసాలు వ్రాయడానికి కొంత గ్రంథ పఠనం, పరిశోధన, ఆలోచనా అవసరం. గ్రంథ రచన కొంత క్లేశాన్ని కలిగిస్తుంది. రాజరాజవర్మ రచించిన విభిన్న కృతుల్ని, వాటి సంఖ్యని, వాటి గుణాల్ని పూర్వాధ్యాయంలో పరిశీలించాం. అటువంటి క్లిష్టమైన పనులమధ్య ఆయన కొంత విరామాన్ని ఆశించేవాడు. కాని ఆయన కోరుకున్న విరామం కాలాన్ని వృథా పుచ్చటం కాదు. సాహిత్య వ్యాసంగంలో కొంత తేలికైన అనువాద రచనల్ని చేయ సంకల్పించాడు. సంస్కృతం నుండి ఆరు కావ్యాల్ని, ఇంగ్లీషు నుండి ఒక దానిని ఆయన అనువదించాడు. సృజనాత్మక ప్రతిభగల ఈ పండిత పరిశోధకునికి భాషాంతరీకరణం ఆనందాన్ని కలిగించే ఒక సాహిత్య వినోదం.

**మేఘ దూత :**

ఉద్యోగంలో ప్రవేశించిన తొలినాళ్ళలోనే ఆయన కాళిదాసుని మేఘదూతాన్ని మళయాళంలో పద్యకావ్యంగా అనువదించాడు. 1894. వ. సంవత్సరం, నాలుగు నెలల్లోనే ఈ అనువాదాన్ని పూర్తిచేశాడు. మళయాళంలో ఆయన రచించిన ప్రథమ కావ్యం ఇదే. ఏ పరిస్థితుల్లో యీ అనువాదానికి పూనుకున్నాడో పీఠికలో వివరించాడు. కేరళపాణినీయాన్ని అనువదించడంలో పూర్తిగా నిమగ్నుడైన ఆయన ఒక దశలో సంస్కృత మళయాళ వాక్య నిర్మాణాలలోని భేదాన్ని కనుగొనడానికి కాళిదాసుని మేఘదూతవంటి మహాకావ్యాన్ని అనువదిస్తే స్పష్టపడుతుందని తలంచాడు.

ప్రతి రోజు కొన్ని శ్లోకాల్ని అనువదించేవాడని ఆయన డైరీని బట్టి తెలుస్తుంది. హరిపాద్ గ్రామానికి కాలి నడకను వెళ్ళుతున్నపుడు కూడ కొన్ని శ్లోకాల్ని అనువదించటం వినోదంగా భావించాడు. సంస్కృత భాషలో పాండిత్యంలేని పాఠకులకు కూడ

అర్థమయ్యేలాగ సరళ మళయాళంలోనే శ్లోకాల్ని అనువదించా లన్నది రాజరాజవర్మ సంకల్పం. అనువాదం యథామాతృకంగా ఉండాలని కూడ ఆయన పట్టుదల. అయినప్పటికీ మూలంలో వున్న ఛందస్సునే మళయాళంలోనూ ఉపయోగించాలన్నది ఆయన ఉద్దేశ్యం కాదు. మాతృక మందాక్రాంత వృత్తంలో ఉంటే, అనువాదం శార్దూల విక్రీడితంలో వున్నది. మళయాళ ఛందస్సులో ప్రసిద్ధమైన ద్వితీయాక్షర ప్రాసనియమాన్ని కూడా ఆయన నియతంగా పాటించ లేదు. ఈ కట్టుబాట్లన్నీ అనవసరమని, ముఖ్యంగా అనువాదాలకు అనవసరమని ఆయన అభిప్రాయం. సంస్కృత శ్లోకాల్ని మళయాళ పద్యాలుగా సంతరించడం ఇదే ఆయన ప్రథమ ప్రయత్నమైనా, అద్వితీయంగా నిర్వహించాడు.

*కుమార సంభవం :*

మేఘదూత కావ్యానికి లభించిన ప్రజాదరణ చాలా ప్రోత్సాహకరంగా ఉండడం చేత రాజరాజవర్మ అనతికాలంలోనే మరొక అనువాదానికి పూనుకున్నాడు. 1894. వ. సంవత్సరం ఒక విద్యార్థికి కుమారసంభవ కావ్యాన్ని బోధింపవలసి వచ్చింది. అప్పుడు కొంత టీకా తాత్పర్యాన్ని తయారుచేసుకోవలసి వచ్చింది. అదే సమయంలో అందులోని శ్లోకాల్ని కూడ అనువదించాడు. ఆ విద్యార్థి అధ్యయనం అర్థాంతరంగా ఆగిపోయినా కుమారసంభవ అనువాదం మాత్రం కొనసాగి 1895. వ. సంవత్సరంలో పూర్తి అయి 1897. వ. సంవత్సరంలో ప్రచురింపబడింది. కాళిదాస కృతమని విమర్శకులందరూ అంగీకరించే మొదటి యెనిమిది సర్గలలో ఆరింటిని రాజరాజవర్మ అనువదించాడు. రతిప్రలాపమనే చతుర్థ సర్గను సంక్షిప్త పరచి, అతి శృంగారాత్మకమైన అష్టమ సర్గను పరిహరించాడు. మేఘదూతానువాదం కన్న కుమార సంభవానువాదం చాలా ఆకర్షణీయంగా ఉంది. అనేక తరగతులకిది పాఠ్య పుస్తకంగా నిర్ణయింపబడడంచేత ఇప్పటికే అనేక ముద్రణల్ని

పొందింది. ఈ రెండు అనువాద గ్రంథాలలోనూ వ్యావహారిక భాషా పదాలు అధికంగా వున్నవని సాంప్రదాయిక విమర్శకుల అభిప్రాయం. అయితే గ్రంథకర్త వాటిని బుద్ధి పూర్వకంగానే వాడాడు.

***శాకుంతలం :***

రాజరాజవర్మ ప్రత్యేక పరిస్థితుల్లో కాళిదాసుని శాకుంతల నాటకానువాదాన్ని చేపట్టాడు. గత నూరేండ్లలో కేరళలోని పలువురు కవులు శాకుంతలానికి ఈడైన కావ్యాన్ని మళయాళంలో రచించాలని అధిక ప్రయాసపడ్డారు. అయితే ఆ కవులలో ప్రతి ఒక్కరు కొంతవరకే కృతకృత్యులయ్యారు. శాకుంతలం యొక్క ఉత్కృష్టత అట్టిది. పండిత ప్రకాండుడైన కేరళవర్మే ప్రప్రథమంగా శాకుంతలం అనువాదానికి పూనుకున్నాడు. 1882. వ. సంవత్సరంలో ప్రకటితమైన ఈ అనువాదం అత్యంత ప్రజాదరణను పొందింది. అయితే ఇందలి ఆలంకారిక శైలి, సంస్కృత సమాస భూయిష్ఠత, పదజటిలత దాన్ని పండితులకు మాత్రమే ఆస్వాద యోగ్యమైనదిగా చేసినై. రాజరాజవర్మ ఈ గ్రంథరాజం యొక్క గొప్పతనాన్ని అంగీకరించినా మళయాళ భాష జాతీయత, నుడికారం అనేక స్థలాల్లో దెబ్బతిన్నవని భావించాడు. అందుచేత అతని మేనమామ రాజరాజవర్మను తన అనువాదాన్ని సంస్కరించి మరొక ప్రతిని తయారుచేయమని కోరాడు. రాజరాజవర్మ అనేక సవరణల్ని సూచించాడు గాని, వాటిలో పెక్కింటిని గ్రంథకర్త అయిన కేరళవర్మ సమ్మతింపలేదు. కేరళవర్మ అనుమతించిన సవరణలతో ''మణిప్రవాళ శాకుంతలము'' అన్న పేరుతో 1912. వ. సంవత్సరం సంస్కరింపబడిన ప్రతి ఒకటి వెలువడింది. విద్వాంసులకు కాక సామాన్య పాఠకుల ప్రయోజనార్థం మరొక సరళమైన అనువాదం అవసరమని రాజరాజవర్మ భావించాడు. వెంటనే ఆయన అనువాదానికి పూనుకున్నాడు. 1912. వ. సంవత్సరమే ''మళ

యాళ శాకుంతలం" అన్న పేరుతో ఈ అనువాదాన్ని ప్రచురించాడు.

ఈ రెండు అనువాదాల్ని పోల్చిచూడడం కష్టసాధ్యం. ప్రతి దానిలోను గుణదోషా లున్నాయి. ఈ అనువాద ద్వయం కాళిదాసుని మహానాటక సదవగాహనానికి, రసానందానికి ఎంతో ఉపకరిస్తవి. కేరళవర్మ, తదితరులు తలంచినట్లు మాతృకకు న్యాయం చేకూర్చడమంటే బాహ్యాంశాలైన ఛందస్సు, భాషా నుడికారం వంటి వాటిని యథాతథంగా అనుకరించటం కాదని రాజరాజవర్మ అభిప్రాయం. ఆయన భావానికి, కావ్యాత్మకు ప్రాధాన్యతనిచ్చాడు. సంపూర్ణంగా అభివృద్ధి పొందని మళయాళం వంటి భాషలో వీటిని అభివ్యక్తీకరించడానికి ప్రయాసపడ్డాడు. కావ్య నిర్మాణాంశాలైన ఛందస్సు, అనుప్రాసలవంటి వాటిలో అధిక స్వేచ్ఛను అభిలషించాడు. సంస్కృత శాకుంతలం వంటి రచన సంస్కృత భాషా పద సంపదని గరిష్ఠంగా ఉపయోగించుకున్నది. అందువల్లే ఆధునిక భారతీయ సాహిత్య రసికులు తత్సంబంధమైన రసానుభూతిని తమ మాతృ భాషల్లో ప్రదర్శించడానికి శ్రమపడవలసి వస్తుంది.

***మాళవికాగ్ని మిత్రము :***

శాకుంతలం మహాకావ్యమే కాక, మహానాటకం కూడా 1882. వ. సంవత్సరంలో మొట్టమొదట ప్రచురింపబడిన కేరళవర్మ విరచిత "అభిజ్ఞాన శాకుంతలం" సంస్కృత పదజాలంతో మణిప్రవాళ శైలిలో వున్నా, రంగస్థల ప్రదర్శనలో సహితం అద్భుత విజయాన్ని సాధించింది. ఇతర సంస్కృత నాటకాల్ని మళయాళంలోకి అనువదించడానికిది నాంది అయింది. అనతికాలంలోనే మళయాళంలో నాటక మొక సాహిత్య ప్రక్రియగా గుర్తింపబడింది. రాజరాజవర్మ శాకుంతల నాటకానువాదం కూడా పాఠ్యగ్రంథంగా, ప్రదర్శన యోగ్యమైన నాటకంగా రెండింట ప్రజాదరణ పొందింది. అందుచేత మరికొన్ని సంస్కృత నాటకానువాదాల్ని చేయడానికి

ఆయనకు ప్రోత్సాహం కలిగింది. 1916. వ. సంవత్సరంలో కాళి దాసుని మాళవికాగ్ని మిత్ర నాటకాన్ని అనువదించ ప్రారంభిం చాడు. నిజానికి 1915. వ. సంవత్సరం మావెలిక్కర అన్న గ్రామంలో శాకుంతల నాటకాన్ని ప్రదర్శించినపుడు అది ఎంతో విజయవంతమైనది. ఆ సందర్భంలో ఆ నాటక సమాజం వారికి ప్రతి ఏడాది ఒక కొత్త నాటకాన్ని వ్రాసి ఇస్తానని రాజరాజవర్మ వాగ్దానం చేశాడు.

మాళవికాగ్ని మిత్రానికి వ్రాసిన మున్నుడిలో ఆయన ఇలా పేర్కొన్నాడు: "అగమ్యమైన వ్యాకరణపు కీకారణ్యంలో అలమటించే నా మనస్సుకు సుందరమైన యీ నాటకోద్యాన వనంలో విశ్రమించడం ఎంతో హాయిగా ఉంది. ఈ ఆనందాన్ని, సుఖాన్ని విడిచిపెట్టుకోలేక, కేవలం ఆ ఆనందానుభూతి కోసమే మాళవికాగ్ని మిత్రాన్ని, అనువాదం బాగున్నా లేకపోయినా అనువదించాను.

మావెలిక్కరలో ఉన్నపుడు ప్రారంభించిన అనువాద కార్యం, తిరువనంతపురంలో ఉత్సాహంతో కొనసాగి, రెండు మాసాల్లోనే అనువాదం పూర్తి అయింది. రాజరాజవర్మ ముఖ్య మైన కొన్ని శ్లోకానువాదాల్ని తన మిత్రులైన పండితులకు విని పించినపుడు, వాళ్ళు అవి మూలాన్ని మించి ఉన్నవని కూడా చెప్ప సాహసించారు. ఇది కొంత అతిశయోక్తి అనక తప్పదు. "కళా విలాస" మనే నాటక సమాజం వారు 1916 వేసవిలో మాళవి కాగ్ని మిత్రాన్ని ప్రదర్శించి, అత్యంత విజయవంతంగా నిర్వ హించారు.

## చారుదత్తం:

1917 వేసవిలో తిరువనంతపురపు అదే కళావిలాస నాటక సమాజంవారు తంపురాన్‌ను మరొక నాటకాన్ని రచించి యిమ్మని కోరారు. ఈమారు విభిన్నమైన పాత్రలతో, నటనాధిక్యతకు అవ

కాశం గల నాటకాన్ని రచింప అభిలషించాడు. శూద్రకుని మృచ్ఛకటిక నాటకాన్ని గ్రహింప మొదట ఉద్దేశించాడు. కాని అందులో కొన్ని అంశాలు చాల సుదీర్ఘమైనవి. కనుక భాసుని చారుదత్తాన్ని గ్రహించాలని ఆలోచించాడు. అది తన నాటకానికి ఉత్తేజాన్ని కలిగించిందని గ్రంథకర్త పేర్కొన్నాడు. కనుక చారుదత్తంలోని మొదటి నాలుగు అంకాల్ని అనువదించి మృచ్ఛకటిక ఉత్తరార్థాన్ని సంక్షిప్తపరచి యీ నాటకానికి ముగింపుగా అనుసంధింప నిర్ణయించాడు. ఎప్పటిలాగే పద్యభాగాల్ని మొదట, తరువాత గద్యభాగాల్ని అనువదించాడు. ఆయన అప్పట్లో తాత్కాలిక ప్రిన్సిపాల్‌గా ఉండడం, తత్సంబంధమైన పనుల ఒత్తిడివలన ఆరంభంలో ఈ అనువాద కార్యం కొంత మందకొడిగ సాగినా, ఆ తరువాత వేగాన్ని పుంజుకున్నది. ఆయన దినచర్య ఆయన ఉత్సాహాన్ని పట్టుదలని ప్రదర్శిస్తుంది.

"పెందలకడనే లేచి స్నానానికి పూర్వం ఒక పన్నెండు శ్లోకాల్ని అనువదించాను. మనస్సు ప్రసన్నంగా ఉండాలని కళాశాలలో తరగతుల బోధన తప్ప తదితర కార్యక్రమాలన్నింటిని అశ్రద్ధచేశాను. టెన్నిస్ ఆడుతున్నపుడు కూడా నా మనసు కవితాలోకంలోనే విహరించేది. రాత్రి కలత నిద్రపోయాను. అయినా అనేక కఠిన శ్లోకాల్ని సునాయాసంగా అనువదించాను."

"ఉదయంనుండి కవిత్వపు భావలోకంలోనే జీవించాను. భాస కవి శ్లోకాలకున్న సహజ సౌందర్యం కాని, తరువాత కవులకున్న కళాపరిపూర్ణత, మెరుగులు గాని శూద్రకుని శ్లోకాలకు లేవు. అందువలన వాటిని మళయాళంలోనికి అనువదించేటప్పుడు మెరుగులు దిద్దే అవకాశం ఎక్కువగా కనపడింది."

ఈ రచన చాలా చురుకుగా, ఖచ్చితంగా సాగింది. అనువాదం, సవరణ, ముద్రణ, ప్రూఫులను దిద్దడం అన్నీ ఒకదాని వెంట మరొకటి కొనసాగి పుస్తకం స్వల్ప వ్యవధిలో వెలువడింది.

తదితర సంస్కృత కావ్య నాటకానువాదాలలోకన్న రాజరాజవర్మ ఈ అనువాదంలో ఎక్కువ స్వేచ్ఛను ప్రదర్శించాడు.

**స్వప్న వాసవదత్త:**

ఏటేటా ఒక నూతన నాటకాన్ని అనువదించి, ప్రదర్శించడం పరిపాటి అయినది. 1918. వ. సంవత్సరానికి భాసుని స్వప్న వాసవదత్త నాటకాన్ని ఎంపిక చేశారు. ఈ నాటకం కూడ విజయవంతంగా నిర్వహింపబడింది. కాని ఇతర నాటకాలలోలాగ స్వప్న వాసవదత్త నాటకంలో హాస్యం తక్కువ. చతుర్థాంకంలో మాత్రమే విదూషకుడు ప్రవేశిస్తాడు. మొత్తంమీద నాటకంలోని వాతావరణం అంత ఉత్సాహకరంగా లేదు.

రాజరాజవర్మకి ఈ నాటకానువాదం చాల సులభంగా, ఉత్సాహంగా సాగింది. భాసమహాకవి దృక్పథంతోను, ప్రవృత్తితోను రాజరాజవర్మ తాదాత్మ్యాన్ని పొంది రచించినందువలన ఆయన రచన అనువాదంగా కాక అనుసృష్టిగా భాసిస్తుంది. ఈ మహాకవి కడపటి అనువాదమైన దీని ప్రాశస్త్యానికి కారణమదే. ఆయన తరువాత మూడు మాసాలు మాత్రమే జీవించాడు.

ఈ సంస్కృతానువాదాలన్నీ అనేకమారులు పునర్ముద్రణాలనందాయి. కళాశాలల్లో, పాఠశాలల్లో పెక్కుమారులు పాఠ్య పుస్తకాలుగా నిర్ణయింపబడ్డాయి. నేటికి కూడ యీ పుస్తకాల ప్రఖ్యాతి వీసమెత్తుకూడా తరగలేదు. ఒక మహాశిల్పి హస్తకృతాలుగా ఇవి అత్యంతాభిమానంతో ఆదరింపబడుతున్నాయి.

**ఉద్దాల చరితం:**

రాజరాజవర్మ ఇంగ్లీషులోని షేక్స్పియర్ వ్రాసిన ఒథెల్లో నాటకాన్ని సంస్కృత గద్యలోనికి అనువదించి దానికి ఉద్దాల చరితమని పేరు పెట్టాడు. రాజరాజవర్మ ఆది రచనల్లో ఇదొకటి (1898). వాస్తవానికిది అనువాదం కాదు కాని అనుకరణ

మాత్రమే. షేక్స్పియర్ రచనలతో అపరిచితులైన సంస్కృత పాఠకులకు ఆ మహాకవి సృజనాత్మకతను చవి చూపించడమే ఈ అనువాదపు ఉద్దేశ్యం. యూరోపియను సంస్కృతితో పరిచయంలేని పాఠకులు చీకాకుపడకుండ నాటకంలోని పాత్రల పేర్లు సంస్కృతానుగుణంగ - ఓథెల్లో = ఉద్ధాల; డెస్టిమోనా - దోషదమనగా మార్చబడ్డాయి. చార్లెస్‌లాంబ్ (Charles Lamb) అన్న రచయిత షేక్స్పియర్ నాటక కథల్ని Tales from Shakespear అన్న పుస్తకంలో సంగ్రహంగ రచించినట్లు రాజరాజవర్మ ఈ నాటకాన్నంతా సంగ్రహించి, సరళ సంస్కృత వచనంలో రచించాడు.

## అధ్యాయం - 7

# సృజనాత్మక విమర్శక రచనలు

పూర్వాధ్యాయంలో రాజరాజవర్మ అనువాదాలను పరిశీలించాం. ఏదో ఒక కృతిని యథామాతృకంగా మరొక భాషలోనికి తర్జుమా చేయడాన్ని అనువాదమని సామాన్యంగా పేర్కొంటారు. మూల గ్రంథం సృజనాత్మకమైనది కావచ్చు. లేదా విజ్ఞానదాయకమైనది కావచ్చు. లేదా కేవలం సమాచారాన్ని అందించేదైనా కావచ్చు. సృజనాత్మక కృతుల్ని అనువదింపదలచినపుడు, ఉత్తమానువాదం చేయదలంచినవారు ఒక విధమైన అనుసృష్టిని చేయాలి. సంస్కృత మహాకావ్యాలను రాజరాజవర్మ ఈ పద్ధతిలోనే భాషాంతరీకరించాడు, సృజనాత్మక శక్తిగలవారే పద్యాలను చక్కగా అనువదించగలరు. అయినప్పటికి అనుసృష్టిని మాతృకతో సమానంగ పరిగణింపలేము. ఎందుచేతనంటే అనుసృష్టికి ఆధారం మాతృకయే. మౌలికమైన సృజనాత్మక రచనల్లో రచయిత యొక్క సృజనశక్తి స్వేచ్ఛగా, సహజంగా

ఉన్నత స్థాయిలో ఉండాలి. అనువాదకునిగా కాక సహజకవిగా రాజరాజవర్మ సేవను పరిశీలిద్దాం.

*సంస్కృత రచనలు :*

రాజరాజవర్మ రచనా వ్యాసంగాన్ని మొట్టమొదట సంస్కృత కవిగా ఆరంభించి, తన 31. వ. ఏట మళయాళ రచనలను చేసినట్లు చూచాం. సంస్కృతంలో ఆయన ఇరవై రెండు పుస్తకాల్ని రచించాడు. అందులో అధిక భాగం లఘుకృతులే. గైర్వాణి విజయమన్న నాటకాన్ని, ఓథెల్లో వచనానుకరణాన్ని ఇంతకు పూర్వమే ప్రస్తావించాం. ''ఆంగల సామ్రాజ్యం'' అన్న మహా కావ్యాన్ని గురించే కొంత విపులంగా పరిశీలించాలి. ''భంగవిలాపం'', ''పితృవిలాప'' మన్న రెండు లఘుకృతులు స్మృతి గీతాల వంటివి. వీటిని గురించి కూడా ముందే ప్రస్తావించాం. మరికొన్ని పద్యాలు స్తోత్రాలు. ఇంక కొన్ని రాజుల, పెద్దల ప్రశస్తి రూపమైనవి. కవి తన రచనారంభ దశలో చేసిన కవితా సాధనాలుగా వీటిని పరిగణింపవచ్చు. ఈ పద్యాలలో కూడా పాండిత్య, ప్రతిభ ప్రతిఫలించినప్పటికి వాటిని ఔత్సాహిక కవి ప్రారంభ దశలో చేసిన కవితాభ్యాసాలుగ మాత్రమే గణించాలి. సంప్రదాయిక కవితా ప్రియుడైన రాజరాజవర్మ విప్లవాత్మకమైన కాల్పనికుడుగా ఎలా మారాడు అన్నదాన్ని అర్థం చేసుకోడానికి అతని సంస్కృత రచనల్లో కొన్నింటిని పరిశీలించవలసి ఉంటుంది.

*సాహిత్య కుతూహలం :*

ఇది తొలినాళ్లలో రాజరాజవర్మ రచించిన కొన్ని శ్లోకాల సంకలనం. ఈ శ్లోకాలకు విద్వాన్ తురవూర్ నారాయణశాస్త్రి గళ్ టీక రచించారు. ఈ సకలనంలో ''సరస్వతీ స్తవము'' (1890) ''వీణాష్టకము'' (1887) ''రాగముద్రాస ప్తకము'' (1889) ''విమానాష్టకము'' (1891) ''హిందూపద వ్యుత్పత్తి'' (1890)

''పితృప్రలాపము'' (1892) ''దేవీ దండకము'' (1888) అన్న శీర్షిక లున్నవి. ఈ శ్లోకాలన్నీ కవి ప్రతిభను వెల్లడిస్తున్నప్పటికీ పితృప్రలాపము అన్నివిధాలా అత్యుత్తమ కవితాఖండిక అని ఉళ్ళూర్ కవి అభిప్రాయం.

**గైర్వాణీ విజయం:**

ఇది శ్లోకాలలో రచింపబడిన ఏకాంకిక, గైర్వాణి (సంస్కృతం) వాణి (ఇంగ్లీషు) అన్నవి ఇందలి ప్రధాన పాత్రలు. సంస్కృతంలో మహా పండితుడు, విజ్ఞాన చింతామణి పత్రికా సంపాదకుడైన పున్నస్సేరినంబి అభ్యర్థనపై రాజరాజవర్మ యీ నాటకాన్ని రచించాడు. అంత పెద్దాయన కోరడం, అందరూ ఒత్తిడి చేయడం వలన ఆరు రోజుల్లోనే దీన్ని పూర్తిచేయవలసి వచ్చింది. 1889. వ. సంవత్సరం తిరువనంతపురంలో సంస్కృత పాఠశాలను స్థాపించినపుడు రచింపబడిన యీ నాటిక అప్పటి పరిస్థితుల్ని ప్రతిబింబిస్తోంది.

ఇంగ్లీషు, సంస్కృత భాషలమధ్య గల సిద్ధాంతపరమైన విభేదాలు ఇంగ్లీషుకు సంస్కృతాన్ని అణచిపెట్టాలని ఉన్న కోరిక యీ నాటికలోని ఇతివృత్తం. సంస్కృత భాషామాత అయిన భారతీదేవి సంస్కృత భాషయొక్క దీనస్థితికి విలపిస్తుంది. ఇంగ్లీషు భాషా గుణదోషాల్ని వివరించడానికి ఇదొక అవకాశాన్ని కలిగిస్తుంది. ఒక ఉత్తమ శ్లోకంలో ఇంగ్లీషు భాషలోని వర్ణసమామ్నాయపు కొరతను గైర్వాణి పరిహాసిస్తుంది. ఈనాటి పాఠకుడికి ఇందులోని వాదాలు, సంభాషణలు రసహీనంగా తోచినా, ఆ కాలంలో విద్యాశాఖలో, సంస్థల్లో నెలకొన్న ఉద్రికతను వ్యక్తం చేస్తుంది.

**విట విభావరి:**

రాజరాజవర్మ రచించిన సంస్కృత పుస్తకాలలో బహుశః ఇది అత్యంత ఆసక్తిదాయకమైనది. ఇందులో నాలుగు రాత్రుల్ని

సూచిస్తూ నాలుగు సర్గల్లో రాధామాధవ సమాగమం వర్ణింప బడింది. శైలిలో, మాట కూర్పులో, భావవ్యక్తీకరణలో రాజ రాజవర్మ అమోఘమైన కళానైపుణ్యాన్ని, కౌశలాన్ని ప్రదర్శిం చాడు.

*ఆంగల సామ్రాజ్యం :*

మహాకావ్య సరళిలో రచించిన యీ ఉద్గ్రంథం రాజరాజ వర్మ కృతుల్లోనే కాక, ఆధునిక కవులు రచించిన సంస్కృత కావ్యాల్లోనే అత్యుత్తమమైనది. ఆంగల సామ్రాజ్యం అంటే బ్రిటిషు వారి సామ్రాజ్యం. భారత దేశంలో బ్రిటీషు సామ్రాజ్యం స్థాపితమైన దాదిగా విక్టోరియా మహారాణి పాలనలో 60. వ. వార్షికోత్సవం వరకు గల ఉదంతం ఇందులో వర్ణింపబడింది. 1895. వ. సంవత్సరం ఆ వజ్రోత్సవం భారత దేశంలో మహావైభవంగా జరిగింది. ఈ వజ్రోత్సవాల్ని పురస్కరించుకొని ప్రసిద్ధ రఘువంశ మహాకావ్య పద్ధతిలో బ్రిటీషు సామ్రాజ్యాన్ని గురించి ఒక పద్య కావ్యాన్ని రచిస్తే బాగుంటుందని రాజరాజవర్మ భావించాడు. వజ్రోత్సవాలు ఈ రచనకు ప్రేరకమైనా సంస్కృత విద్యార్థులు చరిత్ర, భూగోళం వంటి పాఠాలను అభ్యసించడానికి ఈ గ్రంథం ఉపకరిస్తుందని తలంచాడు. కవితారూపంలో వున్నా, వాస్తవ చరిత్రను ఆధారంగా చేసుకొని వ్రాయబడిన యీ గ్రంథం సంస్కృ తంలో చరిత్ర గ్రంథాలులేని కొరతను తీరుస్తుందని ఆశించాడు. తన గురువైన కేరళవర్మను సంప్రదించినపుడు ఆయన రాజరాజవర్మ అభిప్రాయంతో ఏకీభవించాడు వజ్రోత్సవాలకు రెండు వారాలకు ముందు రాజరాజవర్మ ఈ రచనను ప్రారంభించాడు. 23 సర్గలుగల యీ కావ్యరచన 2 సంవత్సరాలలో పూర్తి అయి, 1900. వ. సంవత్సరంలో ప్రచురింపబడింది.

లండన్ మహానగర వర్ణనతో కావ్యం ప్రారంభమవుతుంది, కవి ఆ మహాపట్టణాన్ని దర్శింపకున్నప్పటికీ, తాను విన్నదానిని,

చదివిన దానిని ఆధారంగా, భావనాబలంతో సుందరంగా యథార్థంగా వర్ణించాడు. తరువాత ఈస్టిండియా కంపెనీ వారి సాహస కృత్యాల్ని విశదీకరించాడు. పిదప సోపానక్రమంలో ముఖ్యమైన చారిత్రకాంశాల నన్నింటిని ప్రవేశపెట్టాడు. ప్రసిద్ధులైన భారతీయుల్ని, బ్రిటిషు వ్యక్తుల్ని పరిచయం చేస్తూ, అప్పుడు సంభవించిన సంఘర్షణలు, దోపిడీలు, యుద్ధాలను వర్ణించాడు. తుదకు భారతీయులు బ్రిటిషు వారికి లొంగిపోవడం, దేశంలో శాంతి నెలకొనడం, తత్ఫలితంగా ఆధునికాభివృద్ధి, భారతీయులు ఒక జాతిగా రూపొందడాన్ని వివరించాడు. 11. వ. సర్గలో టిప్పుసుల్తాను కేరళపైకి దండెత్తడం చాలా ప్రముఖంగా వర్ణింపబడింది.

చారిత్రక సంఘటనలకు ఈ క్రింది పుస్తకాల్ని ఆధారంగా గ్రహించినట్లు రాజరాజవర్మ డైరీనిబట్టి తెలుస్తున్నది: హంటర్ రచించిన హిస్టరీ ఆఫ్ ఇండియా, ది రిట్రాస్పెక్ట్స్ ఎండ్ ప్రాస్పెక్ట్స్ ఆఫ్ ఇండియన్ పాలిటీ (The Retrospects and Prospects of Indian Polity) మెకాలే రచించిన ఎస్సేస్ ఆన్ క్లైవ్ అండ్ వారన్ హేస్టింగ్స్ (Mecaulays Essays on Clive and Warren Hastings.) రిచ్చర్డ్ టెంపుల్ రచించిన పిక్చరెస్క్యూ ఇండియా (Richard Temples Picturesque India). మెకంజీ రచించిన ది హిస్టరీ ఆఫ్ ది నైన్‌టీన్త్ సెంచరీ (The History of the Nineteenth Century by Mackenzie) చరిత్రకు' సంబంధించినంతవరకు వీటిని ప్రామాణికంగా గ్రహించాడు. వర్ణనల్ని వాస్తవంగా, సజీవంగా చేయాలన్నది ఆయన పట్టుదల. ఆయన ఉపయోగించిన ఉపమానాలు కొన్ని కాళిదాసుని జ్ఞప్తికి తెస్తాయి. అందులో కొన్ని సోపజ్ఞాలు. మరికొన్ని కాళిదాసేతర మహాకావ్యాల ప్రభావాన్ని తలపిస్తాయి.

స్థూలంగా పరిశీలిస్తే ఆంగల సామ్రాజ్యం సంస్కృతంలో గొప్ప కావ్యమని చెప్పవచ్చు. రాజరాజవర్మ సమకాలికుడు,

మిత్రుడు, మహాకవి అయిన కె. సి. కేశవపిళ్ళై దీనిని మళయాళం లోనికి అనువదించాడు. భారతీయ సంస్కృతిని, సంస్కృతాది భారతీయ భాషల్ని ఘనంగా కీర్తించినట్టి జాతీయ కవియైన రాజ రాజవర్మ, భారతీయ స్వాతంత్ర్యానికి అడ్డుపడినట్టి బ్రిటిషు ప్రభు త్వాన్ని, బ్రిటిషు సామ్రాజ్యాన్ని ప్రశంసిస్తూ కావ్యరచనకు పూనుకోవడం ఈనాటి పాఠకులకు కొంత వింతగా కనిపించవచ్చు. ఈ పరిస్థితిని తూర్ణంగా గ్రహించడానికి నూరేండ్ల క్రితం విద్యా వంతులైన భారతీయులకు బ్రిటిషు సామ్రాజ్యం పట్ల ఎట్టి సదభి ప్రాయముండేదో గుర్తు ఉంచుకోవాలి. రాజరాజవర్మ కీ సంకల్పం కలిగిన కాల ప్రభావాన్ని కూడ విస్మరించకూడదు. ఈనాడు మన మూహించే భారత జాతీయతాభావం అప్పటి కింకా మొలకెత్త లేదు. ఏమైనప్పటికి ఒక సామ్రాజ్య చరిత్రను పద్యకావ్యంగా వ్రాసినంత మాత్రాన ఆ కవి ఆ మహా సామ్రాజ్యపు బానిస అని అనడానికి తగినంత ఆస్కారాన్ని ఈయదు.

## మళయాళ పద్యకావ్యాలు :

రాజరాజవర్మ మళయాళంలో ఎక్కువ రచనలు చేయలేదు. చేసిన వాటిలో రెండు మాత్రమే పేర్కొనదగిన రచనలు. ఇవి రెండూ ఉద్గ్రంథాలు కాకపోయినా, గుర్తింపదగిన రచనలు. ఇవి రెండు కవితలో పూర్తిగా వ్యతిరిక్తాలైన విభిన్న వ్యక్తిత్వాన్ని ప్రదర్శిస్తున్నవి.

## మలయ విలాసం :

1895. వ. సంవత్సరం పడమటి కనుమల్ని వస్తువుగా గ్రహించి రచించిన గేయం మలయ విలాసం. 1895. లో మద రాసునుండి కేరళకు తిరిగివస్తూ రాజరాజవర్మ కొంతదూరం రైలు లో, కొంతదూరం బండిలో ప్రయాణం చేశాడు. ఆ సమయంలో పడమటి కనుమల ప్రకృతి సౌందర్యం ఆయన్ను ముగ్ధుణ్ణి చేసింది. వల్లియూర్ నుండి అరుఘామొళి అన్న ప్రదేశానికి రైలులో

ప్రయాణం చేసే ప్రతి ప్రయాణికుడ్ని ఆకర్షించే పడమటి కనుమల సువిశాల సుందర దృశ్యాలు రాజరాజవర్మను భావోద్రిక్తుణ్ణి చేశాయి. అప్పటి కప్పుడే ఆశువుగ పద్యాలను చెప్పాలన్న కోర్కె కను అణచుకోలేకపోయాడు. ఇది 24 పద్యాలున్న లఘుకృతి. సారస్వత ప్రియులు ఈ ప్రకృతి వర్ణనల్ని శ్లాఘించారు. అప్పటికి మళయాళ భాషలో గేయాత్మకమైన పద్యరచనల్ని గురించి తెలి యదు. కనుక మలయ విలాసం అందించిన వినూత్న పరిమళాన్ని అందరూ ఆహ్వానించారు. కనుక ఈ ఖండిక ఒక నూతన రచనా ప్రక్రియకు దారితీసింది. అదే దీని ప్రత్యేకత.

*ప్రసాద మాల:*

మలయ విలాసం రచించిన తరువాత రాజరాజవర్మ అనువాదా లనే పద్యరూపంలో వ్రాశాడు. తన మరణానికి కొన్ని మాసాలకు ముందు 1918. వ. సంవత్సరంలో రాజరాజవర్మ మళయాళంలో స్వతంత్ర కావ్యాన్ని రచించాడు. 1918 లో తిరువనంతపురపాలకు డైన శ్రీ మూలం తిరునాళ్ యొక్క షష్ట్యబ్దపూర్తి మహోత్స వాలు జరిగాయి. రాజరాజవర్మ ఈ సందర్భాన్ని పురస్కరించుకొని తన పోషకుడైన ఆ మహామహునికి పద్యరూపంలో నివాళు లర్పిం చాడు. కొంత సుదీర్ఘమైన యీ కావ్యం సామాన్యమైన ప్రస్తుతి పద్యాల పద్ధతిలో లేదు. అనేక దేవతా స్తుతులతో, పాండిత్య శౌండీర్యాన్ని ప్రదర్శిస్తున్నది. ఋగ్వేదాన్ని బాగా చదివి దీనిని రచించినట్లు అందులోని అష్టమంత్రాలు వెల్లడిస్తున్నవి. హైందవ దేవతా గణ స్తుతి తరువాత కవి, బుద్ధుని, జినుని, క్రీస్తుని, మహమ్మదుని ప్రస్తుతించాడు. ఇది కవి యొక్క సమదృష్టిని, ఆధ్యాత్మిక, తాత్త్విక దృక్పథాన్ని వ్యక్తం చేస్తున్నది.

## వచన రచనలు

రాజరాజవర్మకు నిస్సందేహంగా కవితా ప్రతిభ వున్నట్లు

పరిశీలించాం. అయితే ఆయన ప్రజ్ఞ పూర్తిగా వికసించింది వచన రచనల్లోనే. ఇతరులు అనుకరింపదగిన ఆధునిక వచనాన్ని రూపొందించిన వచన రచనా సిద్ధహస్తు డాయన. విషయ ప్రధానాలు, వ్యాఖ్యానప్రాయాలు, సవిమర్శకాలు, సృజనాత్మకాలు అయిన పలువిధాలైన వచన రచనల్ని ఆయన రచించాడు. ఆయన వచన రచనల్లో ఛందోవ్యాకరణాలకు సంబంధించినవి ప్రధానమైనవి. ఇవి లక్షణాన్ని మాత్రం చెప్పే శాస్త్రగ్రంథాలు. వీనిలో రసానుభూతికి అవకాశం అరుదు. అటువంటి నీరసమైన రచనల్ని కూడ రాజరాజవర్మ రసవంతంగా నిర్వహించాడు. భాషాసంబంధమైన క్లిష్ట విషయాల్ని, తాత్త్వికమైన చిక్కుల్ని వివరించడానికి సుపరిచిత ఉపమానాల్ని, సాదృశ్యాల్ని ఉపయోగించాడు. విజ్ఞాన ప్రధానమైన ఇటువంటి గ్రంథాల్ని రచించే ఇతరులు అనుకరించడానికి వీలుకాని యేదో కాంతి ఆయన శైలిలో గోచరమవుతుంది. ''కేరళపాణినీయా''నికి (పరిష్కరించిన ప్రతి) ఆయన రచించిన సుదీర్ఘమైన పీఠిక యీ ప్రత్యేక ప్రతిభకు చక్కని నిదర్శనం.

**ఆయన వ్యాసాలు, సాహిత్య విమర్శలు రాశిలో తక్కువైనా వాసిలో అగ్రగణ్యాలు. ఆయన వచన రచనలు వాటి సంక్షిప్తతకు, పొందికకు, స్పష్టతకు, భావసౌందర్యానికి, సహేతుకతకు ప్రఖ్యాతి గన్నవి.**

## సాహిత్య విమర్శ

రాజరాజవర్మ కాలానికి మళయాళంలో సాహిత్య విమర్శ ప్రాథమిక దశలో మాత్రమే ఉంది. ఆ కాలంలో పద్యాల బాహ్య కూర్పును విశ్లేషించి ఛందోవ్యాకరణ దోషాలు లేకుండ నిర్దుష్టంగా ఉన్నవా అని పరిశీలించడానికి, వాటికి వివరణాత్మక వ్యాఖ్యానాలు, టీకలు వ్రాయడమన్న సంప్రదాయిక పద్ధతికి మాత్రమే పండితులు అలవాటు పడివున్నారు. పాశ్చాత్య వాఙ్మయ ప్రభావం

వల్లనే సాహిత్య ప్రక్రియల అంతర్గతాలైన విలువని వెలుగులోకి తెచ్చే భావన ఆరంభమైనది.

## నల చరిత్రం - నూతన ప్రతి :

1905. లో ఉణ్ణాయి వారియర్ రచించిన "నల చరిత్రం" అన్న కథకళి కావ్య ప్రశస్తిని గురించి రాజరాజవర్మ రచించినపుడు సాహిత్య రసజ్ఞులకు కనువిప్పు కలిగింది. ఆధునిక విమర్శ పద్ధతులలో ఒక ప్రాచీన కావ్యాన్ని విమర్శించవచ్చునని ఆయన నిరూపించాడు. "నలచరిత్రం ఆట కథా" అన్నది ఒక కఠిన కావ్యం. ముద్రణ దోషాల వలన క్లిష్టతరమైనది. కనుక రాజరాజవర్మ నిర్లక్ష్యంగ ముద్రించడం వలన దొరలిన దోషాల్ని సవరించి, కఠినమైన భాగాలకు వ్యాఖ్యానాన్ని సమకూర్చ నిర్ణయించుకున్నాడు. అలా పరిష్కరించిన ఆ ప్రతికి ఆయన సమకూర్చిన వికాసవంతమూ, పాండిత్య స్ఫోరకమూ అయిన పీఠిక ఇప్పటికి సాహిత్య విమర్శలో ఒక మణిపూసగా భాసిస్తున్నది. ఆ పీఠికకు "కాంతార తారకం" అని పేరు. ఈ పీఠికలో స్వతంత్ర భావాలు గల విమర్శకుడు, సంస్కారవంతుడు సహృదయుడు ఒక కావ్యాన్ని అనుశీలించి, అందులోని సహజ సౌందర్యాన్ని ఆవిష్కరించి, విశదీకరించడాన్ని చూస్తాం

## ఇతర కావ్య పీఠికలు

ముందే పేర్కొన్నట్లు 1911 లో. కేరళవర్మ రచించిన శాకుంతలానువాదాన్ని సంస్కరించి, ప్రతిని ప్రకటించారు. ఈ ప్రతికి రాజరాజవర్మ రచించిన పీఠికలో రసాన్ని గూర్చిన ఒక సమగ్ర వ్యాస మున్నది. సందేశ కావ్యాలలో అసదృశ్యమైనదిగ పరిగణింపబడే కేరళవర్మ "మయూర సందేశానికి కూడ రాజరాజ వర్మ అత్యద్భుతమైన ఉపోద్ఘాతాన్ని సమకూర్చాడు. సన్నిహిత బంధువైనందున చూపిన కించిత్తు పక్షపాతాన్ని పరిగణించకపోతే,

ఈ ఉపోద్ఘాతం నిస్సందేహంగ విలువకలది. ఈ కావ్యంలోని ఉత్తమ గుణాల్ని ఎత్తిచూపే సద్విమర్శయిది.

*నళిని కావ్య ప్రశస్తి:*

కుమరన్ ఆసన్ రచించిన ''నళిని'' కావ్యానికి రాజరాజవర్మ సంతరించిన పీఠిక పరిశీలిస్తే, మళయాళ సాహిత్య చరిత్రలో అదొక నూతనాధ్యాయాన్ని ఆరంభించినట్లు గుర్తిస్తాం. ఆధునిక యుగంలోని మళయాళ కవులలో కుమరన్ ఆసన్ ప్రతిభావంతుడని ఇటీవల గుర్తింపబడింది. శృంగార కావ్యమైన నళినిని (1912) పాఠకలోకానికి రాజరాజవర్మ పరిచయం చేసిన కాలంలో ఆసన్ కవి అజ్ఞాతుడు. ''ఒరు వీణ పూవు'' (= రాలిన పూవు, 1907) అన్న కావ్యాన్ని ఆసన్ కవి ప్రచురించినపుడు పాఠకులు ఆయన్ను గుర్తించక పోలేదు. వెనుకబడిన వర్ణమైన ఈళవ కులానికి చెందిన కవిని ప్రత్యేకంగా గుర్తించడానికి అంత మాత్రం చాలదు. అగ్ర వర్ణాలకు చెందిన పండితులు, విద్వాంసులు ఇటువంటి కవులని ప్రస్తుతించడానికి ముందు వెనుక లాడేవారు.

నళిని కావ్యంలోని ఒక వినూత్న కాంతిని అతి వేగంగా గుర్తించిన ఘనత రాజరాజవర్మకే దక్కింది. ఈ కావ్యం అపూర్వమైన పంథాలో నడిచిందని నిర్ద్వంద్వంగా లోకానికి రాజరాజవర్మ చాటి చెప్పాడు. 'నళిని' కొత్త పంథా త్రొక్కిన ప్రేమ గాథ. పూర్వ కావ్యాలలో విసుగు పుట్టించే పద్ధతికన్న ఇదెలా విభిన్నంగా ఉన్నదో రాజరాజవర్మ విశదీకరించాడు. కుమరన్ ఆసన్ వర్ధిష్ణువు కాగల కవి అని, మళయాళ పాఠకులు ఎంతో కాలంగ ఎదురుచూస్తుండిన అనుపమానమైన శృంగార కావ్యం నళిని అని ఆయన ప్రకటించాడు. కుమరన్ ఆసన్‌కు ఇదెంత ప్రోత్సాహాన్ని కలిగించింది! రాజరాజవర్మ ప్రవచించినదంతా సత్యమని ఆ తరువాతి చరిత్ర నిరూపించింది. రాజరాజవర్మ అంతర్దృష్టిని, ఆధునిక దృక్పథాన్ని, భావిసూచనని ఇప్పుడు అందరూ ప్రస్తుతిస్తు

న్నారు. కాని ఈ రోజుల్లో పేరు పొందిన కవులు, పండితులు రాజరాజవర్మ శుద్ధ అవివేకి అని భావించారు.

### ఇతర ఉపోద్ఘాతాలు :

సుప్రసిద్ధ కవి, నాటక కర్త అయిన కె. కృష్ణన్ తంబి రాజరాజవర్మ శిష్యుల్లో ప్రముఖుడు. 1914. వ. సంవత్సరంలో ఆయన 'కపాలకుండల' అన్న ఒక స్వతంత్ర నవలని రచించాడు. అయినా అదే పేరు గల బంకించంద్ర నవల కొంతవరకు ఈ నవల రచనకు ప్రేరకమనక తప్పదు. ఈ నవలకు రాజరాజవర్మ వికాస దాయకమైన ఉపోద్ఘాతాన్ని రాశాడు.

కె. రామకురూప్ రచించిన 'సౌదామిని' (1914) అన్న మరొక నవలకు కూడ రాజరాజవర్మ మున్నుడిని రచించాడు. ఈ మున్నుడి కూడ చాల ఆసక్తిదాయకంగ, ప్రబోధాత్మకంగా ఉన్నది. పాఠకుల మనోవికాసం కొరకు ఇటువంటి కథల ద్వారా నైతిక విలువల్ని పరోక్షంగా ప్రదర్శించడంలోని ప్రాధాన్యతని ఈ మున్నుడి నొక్కి వక్కాణించింది.

## వ్యాసాలు

తనకు అత్యంత ప్రియమైన జ్యోతిశ్శాస్త్రంలో రాజరాజ వర్మ విస్తృతమైన, తీవ్రమైన పరిశోధనలు చేసాడు. "పంచాంగ శుద్ధి పద్ధతి" "కేరళ జ్యోతిశ్శాస్త్రము" అన్న విజ్ఞానదాయకా లైన పాండిత్య పటిమగల పరిశోధన వ్యాసాలు రెండింటిని రచించాడు. కుఞ్ఞికుట్టన్ తంపురాన్ అనువదించిన మహాభారతాన్ని ప్రశంసిస్తూ ఒక వ్యాసాన్ని వ్రాశాడు. పాఠశాల వాచకాల కొరకు, కళాశాల పాఠ్య పుస్తకాల నిమిత్తం రాజరాజవర్మ చాలా వ్యాసాలను రచించాడు. మళయాళ వచనంతో వ్యాస రచనకు అవి మార్గదర్శకాలయ్యాయి.

### అధ్యాయము-8

# సాహిత్య పునర్వికాస ప్రదాత

వాఙ్మయరంగంలో రాజరాజవర్మ సాధించిన ఘన విజయాల్ని రేఖామాత్రంగా తెలుసుకోగలిగాం. ఈ అధ్యాయంలో పూర్వాధ్యాయాల్లో చెల్లాచెదరుగవున్న విషయానంతటిని సేకరించి కొంత సమగ్రమైన చిత్రాన్ని చిత్రింప ప్రయత్నిద్దాం. సంస్కృతము భారతీయ భాషల విద్యాప్రణాళికల్ని రూపొందించడంలో, కళాశాల అధ్యాపకత్వంతో ఆయన జీవిత ద్వితీయార్ధం నిర్విరామమైన కార్యకలాపాలతో నిండిపోయింది. ఇవికాక ఆయనకు అభిమతాలైన వ్యావృత్తులుండినై. విమర్శకుడిగా, వ్యాసకర్తగా, కవిగా, పథక రచయితగా, పరిశోధకుడిగా నిర్విరామకృషి చేశాడు. జ్ఞాన సముపార్జన ఆయన ద్వితీయ ప్రకృతి. సామాన్యంగా ఏకీభవించని విభిన్న ప్రవృత్తుల సమ్మేళనమే ఈయన. సృజనశక్తి కొంచెమైనా లేని గొప్ప పరిశోధకుల్ని, మహామేధావుల్ని మన మెరుగుదుం. కఠినసాధనతో పాండిత్యాన్ని అలవరచుకోడానికి బద్ధకించే సృజనశీలురు కూడా మనకు తెలుసు. గంటల తరబడి తమ కభిమతమైన అంశాలను గురించి పరిశ్రమిస్తారుగాని అనుసృష్టి అన్నా హాస్యమన్నా విముఖతను చూపే ప్రతిభావంతులు కూడా మనకు తెలుసు. రాజరాజవర్మ గొప్ప పరిశోధకుడు. కవి, రసికుడు, శ్రమజీవి. అయినా జీవితాన్ని ఆనందంగా అనుభవించిన వ్యక్తి.

ఆయనది ద్వంద్వ ప్రకృతి అని ఆయన రచనలు వెల్లడిస్తాయి. కవి, విద్వాంసుడైన కేరళవర్మ ప్రత్యక్ష పర్యవేక్షణలో, సాంప్రదాయిక పద్ధతిలో రాజరాజవర్మ పెరిగాడు. ఆయన తొలి రచనలన్నీ సంస్కృతంలోనే రచింపబడ్డాయి. ఆ రోజుల్లో ఇంకా అభివృద్ధి చెందని మాతృభాష అయిన మళయాళంలో కవిత్వం చెప్పడం న్యూనతగా ఆయన భావించి ఉంటాడు. ఘనపాఠీలైన సంస్కృత

కవుల్ని అనుకరిస్తూ ఇంచుమించు సంస్కృత కవిత్వంలో మునిగి తేలాడు. కొన్నేండ్లు గడచిన తరువాత ఇదే రాజరాజవర్మ సంస్కృత సమాస విరహితమైన సరళ మళయాళాన్ని సమర్థించడాన్ని పరికిస్తాం. సంస్కృత పదభూయిష్ఠమైన తన శాకుంతలాన్ని సవరించడానికి కేరళవర్మను సమ్మతింపచేయడంలో కృతకృత్యుడు కావడాన్ని కూడా చూస్తాం. సులభమైన మళయాళంలో కవిత్వాన్ని వ్రాయడానికి, అనువాదాలు చేయడానికి ప్రారంభించడమే కాకుండా రాజరాజవర్మ ఆ రోజుల్లో సామాన్య రచయితలకు ఆధారమైన వచన రచనలకు కూడా ఉపక్రమించాడు. అడపాదడపా కేరళవర్మ కూడా గద్యరచనల్ని చేసేవాడు. కాని ఆ గద్య ఆయన నవల "అక్బరు"లో లాగ సమాసాలంకార భూయిష్ఠంగా, చాలా జటిలంగా ఉండేది. పాఠశాల విద్యార్థుల నుద్దేశించి వ్రాసేటప్పుడు మాత్రం సులభ వచనంలో వ్రాసేవాడు. అయితే అలా రచించడం తన స్థాయినుండి దిగి రావడంగా కేరళవర్మ భావించేవాడు.

రాజరాజవర్మ విషయం అలా కాదు. తప్పనిసరిగా అవసరమైన చోట్ల మాత్రం సంస్కృత పదాల్ని ఉపయోగిస్తూ, సూటియైన సులభ గ్రాహ్యమైన మళయాళ వచనాన్ని వ్రాయడానికే ఆయన అభిలషించాడు. వచన రచనల్లో పూర్తిగా నిమగ్నుడై పద్య రచనను ఒక వ్యాపకంగా, ఒక వ్యాసంగంగా పరిగణించాడు. శాస్త్రీయ దృక్పథం, విమర్శనాభినివేశం విజృంభించి, ఆయనలోని కవితాశక్తిని అణచివేశాయి అని కూడా చెప్పవచ్చు. ఆయన తొలి సంస్కృత రచనల్లో ఒకే రకమైన ఆలంకారిక శైలిని చూస్తాం. కుమారసంభవ శాకుంతలానువాదాలలో ఆయన అభిరుచిలో గొప్ప మార్పును చూస్తాం. నలచరిత్రం, సాహిత్యసామ్రాజ్యం వంటి సంశోధితప్రతులు ఆయన వ్యక్తిత్వంలో, సాహిత్య దృక్పథంలో ఏర్పడిన మార్పును వ్యక్తం చేస్తాయి. ఆయన వ్యక్తిత్వంలో ఇద్దరు

రాజరాజవర్మలు గోచరిస్తారు. ప్రథమ వ్యక్తి పూర్వసంప్రదాయానుశీలి. ద్వితీయుడు ఆధునికుడు. ఎప్పుడు, ఎక్కడ ఈ మార్పు సంభవించింది ? సమాధానం చెప్పడం కష్టం. ఇది అతని వ్యక్తిత్వంలో ఏకకాలంలో జరిగిన పరివర్తనగా భావించవచ్చు. 19. వ., 20. వ. శతాబ్దాల మధ్యగల భేదమే ప్రథమ రాజరాజవర్మకు ద్వితీయ రాజరాజవర్మకు మధ్యగల భేదమని స్థూలంగా చెప్పవచ్చు. ఆయన సాహిత్య రచనల్ని పరిశీలించినట్లయితే, 1900 ప్రాంతంలో ఆయన దృక్పథంలో గుర్తింపదగిన ఒక మార్పువచ్చినట్లు నిశ్చయంగా చెప్పవచ్చు.

## సాహిత్య పునర్వికాసం

రాజకీయ, సాంఘిక వ్యవస్థల్లో వచ్చిన మార్పుల ఆధారంగా ఆయనలోని ఈ పరివర్తనని కొంత బాగా అర్థం చేసుకోగలం. ఒక వ్యక్తి ఎంత మహనీయుడైనా, ఉన్నతుడైనా, తన పరిసర సమాజంచేత కొంతవరకు తీర్చిదిద్దబడతాడు. ఇది వాస్తవమైనా, కొందరు వ్యక్తులు తాము జీవించి వున్న సమాజానికే నూతన మార్గాన్ని చూపే మార్గదర్శకులవుతారు. కేరళవర్మ, రాజరాజవర్మ, చందూ మీనన్, సి. వి. రామన్ పిళ్లై వంటి ఆలోచనాపరులు సమాజంలో నిర్వహించిన పాత్రను అవగాహన చేసుకోడానికి భారతీయ సాహిత్యంలో మళయాళ వాఙ్మయం ఒక భాగమని గ్రహించడం అవసరం.। భారతీయ సాహిత్యం కూడా హైందవ జీవితాన్ని, భారతీయ రాజకీయాల్ని, సంస్కృతిని ఆధారం చేసుకోనున్నదని కూడా మనం గ్రహించాలి. వాఙ్మయం 'జీవితమంత సువిశాలమైనది గనుక, సంప్రదాయక విధాల్ని ప్రతిబింబించి, జీవితాన్ని చైతన్యవంతం చేసే విప్లవాత్మక చర్యల్ని ప్రోత్సహించాలి.

పాశ్చాత్య నాగరికతా వ్యామోహంతో బ్రిటిషు వారి ప్రభావం ప్రారంభమైనది; అయితే అనతి కాలంలోనే ఆ ప్రభా

వానికి ప్రతిక్రియ జరిగింది. మన భారతీయ సంస్కృతి వైభవానికి గర్వపడాలన్న భావం చోటు చేసుకున్నది. దీని ఫలితమే సమాజంలో కలిగిన పునర్వికాసం. ఇంగ్లీషు విద్యాభ్యాసం వలన ప్రథమ దశలో ఈ పునర్వికాసం మత సాంస్కృతిక రంగాలలో 1857-1905. సంవత్సరాల మధ్య కాలంలో కలిగింది. 1905-1920. వరకు జాతీయతాభావం ఉప్పొంగి హోంరూలును వ్యతిరేకించిన కాలం రెండవ దశ. 1920-1947 వరకు గాంధీమహాత్ముని తిరుగుబాటే మూడవ దశ అని విశదమవుతుంది.

కొంచెం ముందు వెనుకలుగా ఈ మూడు దశల ప్రభావాన్ని సాహిత్యంపై చూడవచ్చు. భారతీయ సాహిత్యాలన్నింటిలో ఈ జాతీయోద్యమ ప్రభావం ప్రస్ఫుటమవుతుంది. ఈ శతాబ్దానికి (1885-1915) పదిహేను సంవత్సరాలు పూర్వం, పదిహేను సంవత్సరాలు తరువాత ఆధునిక చైతన్య వికాసంలో అతి ముఖ్యమైన కాల మని కేరళ చరిత్ర వెల్లడిస్తుంది. హిందూ మతంలో పాతుకపోయిన మూఢాచారాల్ని, మూఢనమ్మకాల్ని కూల్చడానికి, స్త్రీల అంతస్తును పెంచడానికి, వ్యత్యాసాన్ని త్రుంచడానికి, బహుభార్యాత్వాన్ని నిర్మూలించడానికి పాశ్చాత్య విద్య ఉపయోగపడింది. తిరువనంతపుర రాజావారికి ఉద్యోగాలలో బ్రాహ్మణ గుత్తాధికారాన్ని గురించి సమర్పించిన మళయాళీ మహాజరు (1891), ఈళవ కులస్థుల ఇబ్బందుల్ని పేర్కొంటూ సమర్పించిన ఈళవ మహాజరు (1896) ఈ రెండున్ను కేరళలో సంభవించిన మతపరమైన, సామాజిక పరమైన మేలుకొలుపుకు నిదర్శనాలు. ఈ చైతన్యం ఫలితంగా 1903. వ. సంవత్సరం శ్రీ నారాయణగురు ప్రోద్బలంతో ఈళవుల సంక్షేమార్థం ఎస్. ఎన్. డి. పి. యోగం; 1914. వ. సంవత్సరంలో మన్నాత్ పద్మనాభన్ నాయర్ల కొరకు స్థాపించిన నాయర్ల సేవా సమాజం వంటి సంస్థలు ఏర్పడ్డాయి. అగ్రవర్ణాల వారైన నంబూదరీలు కూడా తమ సాంఘిక

సమస్యల పరిష్కారార్థం 1908. వ. సంవత్సరం "యోగక్షేమ సభ" అన్న దానిని నెలకొల్పారు. వీటినిబట్టి ఆ నాటి సాంఘిక వాతావరణాన్ని గణించవచ్చు. రచయితలు, మేధావులు సామాజిక పరిస్థితుల్ని తున్ణంగా ఆకళించుకొని, జీవిత విధానంలోను, రచనల్లోను తీవ్రమైన మార్పు అవసరమని గుర్తించారు. కొంద రీ మార్పుకు విశేషంగా స్పందించారనడంలో సందేహం లేదు. ఇక్కడ సార్వత్రికమైన పునర్వికాసం ఆవిర్భావాన్ని మనం చూడవచ్చు.

## కేరళవర్మ - రాజరాజవర్మ

కేరళవర్మ ఆయన పద్ధతిలో కొన్ని సాహిత్య ప్రక్రియల పునర్వికాసానికి నాంది పలికినా సాంప్రదాయపు ఒత్తిడి వలన పూర్తి స్వేచ్ఛను ప్రదర్శించలేకపోయాడు. రాజరాజవర్మ అలా కాక పూర్తి తిరుగుబాటు యొక్క ఆవశ్యకతను గుర్తించడమే కాక, తన సమకాలీన రచయితలకు మార్గదర్శకుడై, వారు నడువవలసిన బాటను సూచించాడు. కేరళవర్మ రాజరాజవర్మ కన్న పద్ధెనిమిదేండ్లు పెద్దవాడు. అంతకు ముందు తరానికి చెందినవాడు. కనుక వారి మధ్యగల అంతరాన్ని అర్థం చేసుకోవచ్చు, అంతేకాక కేరళవర్మకు గల రాచరికపు సంబంధం, ఆయన పలుకుబడి, అయన్ను భిన్నస్థాయికి చెందిన వానిగా చేశాయి. ఆయన పరిచితులు, మిత్రులు పై అంతస్థుకు చెందిన వారు. రాజరాజవర్మ అయితేనో, విద్యాసంస్థల్లో ఉపాధ్యాయుడుగ అన్నిరకాలైన వ్యక్తుల్ని సంప్రతించవలసి వచ్చేది. వర్గ వర్ణ విభేదాన్ని పాటించకుండా అందరితో కలసి ఉండడం ఆయనకు ఆనందాన్నిచ్చేది. వారిద్దరిలో సమానమైన గుణాలు అనేకమున్నా వారి అభిరుచుల్లో, ఆచరణల్లో ఏకీభవించలేక పోయేవారు.

వారిద్దరికున్న సంబంధం ప్రత్యేకమైనది. మళయాళ వాఙ్మయ చరిత్రలో మరెక్కడ అటువంటి విశిష్ట సంబంధాల్ని చూడలేం.

ఈ మామ, మేనల్లుళ్లు నిజంగా గురుశిష్యులు. మామకు మేనల్లుని మీద అపారమైన వాత్సల్యం. మేనల్లునికి మామయెడల అమిత గౌరవం. మామ సలహాదారు, పోషకుడు, ప్రేరకుడు. వారిద్దరూ ఇంచుమించు ఒకే వాతావరణంలో పెరిగారు. అయినప్పటికి వారిద్దరూ విభిన్న స్వభావులు. వారి వ్యక్తిత్వాల్లో కొట్టవచ్చినంతటి వ్యత్యాసమున్నది. మేనల్లుడు అతివేగంగా ఎదిగి తన సొంత వ్యక్తిత్వాన్ని, స్థైర్యాన్ని పెంపొందించుకున్నాడు. మామ అల్లుడు సాధించిన విజయాలను గుర్తించి, సాహిత్య సంప్రదింపులలో అతని సలహాలను తీసికొన ఆరంభించాడు. వారివురి పరస్పర సహకారం, ఆంతరంగికత మళయాళ వాఙ్మయ చరిత్రలోనే అపూర్వ సన్ని వేశాల్ని సృష్టించింది. ఈ సహచరుల మధ్య అప్పుడప్పుడు అపార్థాలు, ఆక్షేపణలు, సవాళ్ళు మొలకెత్తేవి. వీటికి కారణం వ్యక్తిగత ఈర్ష్యాసూయలు కావు. లక్ష్యాలలో, సిద్ధాంతాలలో వీరిద్దరు వ్యతిరేకించడం దీనికి కారణం.

శాకుంతలాన్ని ప్రథమంగా మళయాళంలోనికి అనువదించి నందువల్ల, కాళిదాసుని కవితాభావనలకు సదృశమైన భావనా బలం ఉండడంవలన కేరళవర్మను "కేరళ కాళిదాసు" అని వ్యవహరించేవారు. కాని శైలిలో ఆయన శ్రీహర్షుని గొప్ప ఆదర్శంగా గ్రహించాడు. రాజరాజవర్మ అయితే కవితా వస్తువులో, శైలిలో కాళిదాసునే తన ఏకైక ఆదర్శంగ స్వీకరించాడు. సంస్కృతపద బంధాల్ని, కూర్పుల్ని, యథేచ్ఛగ ఉపయోగించిన మణిప్రవాళశైలి కేరళవర్మదని ఇదివరకే సూచించడం జరిగింది. అలంకారాల్ని, అనుప్రాసల్ని ఏరియేరి ఎన్నుకునేవాడు. ఆయనకు పద్య నిర్మాణంపట్ల, శబ్దాడంబరం పట్ల పట్టుదల మెండు. అప్పుడప్పుడు ఛందో నిర్బంధానికి లొంగిపోయేవాడని కూడా చెప్పవచ్చు. ఏమైనా ఆయన ప్రతిభాశాలియైన కవి; పండిత కవి. కవితా ప్రతిభలో రాజరాజవర్మ తన మేనమామ ప్రజ్ఞకు సరి

తూగగలిగేవాడు కాడు. కళకొరకు అభిరుచిని పెంపొందించుకున్న పండిత విమర్శకుడు రాజరాజవర్మ. రాజరాజవర్మ శైలి సరళ మైనది. ఛందస్సుకన్న కవితాత్మ, భావన మాత్రమే ముఖ్యమని విశ్వసించినవాడు రాజరాజవర్మ. ఆయన శూన్యమైన మాటల గారడీని చేసేవారిని చూచి పరిహసించేవాడు. వస్తు వైవిధ్యం, వినూత్న భావాలు, ప్రదర్శనలో పలు పోకడలు, అన్నింటిని మించి స్వేచ్ఛా ప్రవృత్తికి ఆయన ప్రాధాన్యత నిచ్చాడు. ఆ యుగ లక్షణమైన కాల్పనికతకు నాంది పలికి ఆదరించాడు. ఆయన విమర్శనాత్మక రచనల్లో కూడా వినూత్నతను స్పష్టంగా చూడ వచ్చు. ఈ సిద్ధాంతపరమైన భేదాభిప్రాయాల వలన వారిద్దరి మధ్య చెలరేగిన ఉద్రిక్తక సాహిత్య వివాదాలకు దారితీసి, సాహిత్య ప్రియుల్ని కొన్నాళ్ళు కలవరపరచింది. మనకు సంబం ధించిన విషయం గనుక దాన్ని గూర్చి సంగ్రహంగా ప్రస్తావించు కొందాం.

## అంత్యప్రాసను గూర్చిన వివాదం

ఇతర భారతీయ భాషలలో లాగే మళయాళ భాషలో కూడా కవులు పలురకాలైన అంత్యప్రాసల్ని అనుసరిస్తుంటారు. మళయాళంలో అధిక సంఖ్యాకులైన కవులు ద్వితీయాక్షర ప్రాస మీద ప్రత్యేకాభిమానాన్ని చూపేవారు. ఎందుకీ ప్రాసను మాత్రం అధికంగా అభిమానించారన్నది పరిశోధింపదగ్గ అంశం. అయితే ఇలా నెలకొన్న ఈ సంప్రదాయం కొన్ని తరాల వరకు నిరాటంకంగా కొనసాగింది. ఈ ప్రాస శ్రావ్యంగా ఉంటుందన డంలో సందేహం లేదు. కాని ఈ నిర్బంధం వలన కావ్యంలో అతి ముఖ్యమైన ఇతర అంశాలు దెబ్బతినసాగాయి. 1891. వ. సంవత్సరం లోనే ప్రతి పాదంలో ఈ ద్వితీయాక్షర ప్రాసనూ నియ తంగ పాటించడంలో గల గుణ దోషాల్ని కవులు ఒక సాహిత్య పత్రికలో చర్చించారు. ఈ విషయంలో ముఖ్యులైన కవులకి ఏక

వాక్యత కుదరకపోయినా, తరువాత కొన్నేండ్ల వరకూ ఇది వివాదా స్పద విషయంగా రూపొందలేదు. ద్వితీయాక్షర ప్రాసను పాటించా లన్నది కేరళవర్మ అభిప్రాయం. రాజరాజవర్మ ఆ నిర్బంధాన్ని వ్యతిరేకించాడు. ఈ నియమం పరిణితిని పొందని సాహిత్యపు ముద్రగా ఆయన భావించాడు.

1908. వ. సంవత్సరం ఈ వివాదం చిలికి చిలికి గాలి వాన అయింది. ఈ పెనుతుఫానుకు దారితీసిన పరిస్థితుల్ని ఇక్కడ క్లుప్తంగా వివరించవచ్చు. ఈ ద్వితీయాక్షర ప్రాసను నియతంగా అనుసరించవలసిన ఆవశ్యకత లేదన్న వాదాన్ని కేరళవర్మ సమక్షం లోనే ప్రతిపాదించి, దాన్ని గురించి ఆయన అభిప్రాయాన్ని అప్పటికప్పుడే తెలుసుకోవడం సముచితమని రాజరాజవర్మ భావిం చాడు. 1908 వ. సంవత్సరం తిరువనంతపురంలోని మహారాజ కళాశాల వారు మళయాళ సమాజపు వార్షికోత్సవాన్ని జరుప నున్నపుడే అవకాశం లభించింది. ఆ నాటి కార్యక్రమానికి కేరళ వర్మను అధ్యక్షునిగా, మహాకవి కె. సి. పిళ్లైను ఉపన్యాసకునిగా ఆహ్వానించమని రాజరాజవర్మ సమాజ కార్యదర్శియైన పి అనంత పిళ్లైను ఆదేశించాడు. అనేక సైద్ధాంతిక వివాదాలలో రాజరాజ వర్మనే సమర్థించే కె. సి. పిళ్లై, అతనితో ఏకీభవించి "భాషా కవిత" (మళయాళ కవిత) అన్న విషయంపై వ్యాసాన్ని తయారు చేసి ఆ నాటి సభలో సమర్పించాడు. ఆ వ్యాసం మళయాళ కవి త్వాన్ని గురించే అయినా ప్రాస నిర్బంధ ముండరాదన్న అంశాన్ని నొక్కి వక్కాణిస్తున్నది. స్వపక్షాన్ని చక్కగా సమర్థించిన వ్యాస మది. అధ్యక్షులవారు అందులోని అంతరార్థాన్ని వెంటనే పసిగట్టి దాని వెనుక దాగివున్న వ్యూహాన్ని గుర్తించాడు. ఆయన సద స్యుల్ని ఉద్దేశించి ఉపన్యసిస్తున్నపుడు ఇంచుమించు తాను సిద్ధ పరచుకొని వచ్చిన విషయాన్నే ఉపన్యసించాడు. సందర్భాను సారంగా తన సహజ ధోరణిలో ప్రతిపక్షుల వాదాల్ని ఎదుర్కొ

న్నాడు. తన ప్రతిపక్షులు సుకవిత్వాన్ని రచింప అసమర్థులన్న అభిప్రాయాన్ని వెలిబుచ్చాడు. శ్రావ్యమైన పద్యంలోని ప్రతి పాదంలో ద్వితీయాక్షరం అక్షర్ల మైత్రిని కలిగివుంటుందని కూడా ఆయన వాదించాడు. కేశవపిళ్లై వ్యాసాన్ని "భాషాపోషిణి" అన్న పత్రికలో ప్రచురించారు. మరు సంచికలో కేరళవర్మ అధ్యక్షోపన్యాసాన్నే కాక, కవి ఉళ్ళూర్, యస్. పరమేశ్వర అయ్యర్, కె. సి. కేశవపిళ్లై వాదాన్ని విమర్శించి పూర్వ పక్షం చేసిన వ్యాసాన్ని కూడా ప్రకటించారు. ఇది మొదలు వరుసగ మూడేండ్లు పత్రికల్లో, సభల్లో, వేదికల మీద కవులు, పండితులు పాల్గొని జరిపిన తీవ్రవాదోపవాదాల కిది నాంది అయింది. ప్రసిద్ధ కవులు పలువురు తమ తమ వాదాలకు ఉపబలకంగా సమస్యల్ని, పద్యాల్ని ప్రాసతో, ప్రాస లేకుండ సంతరించారు. మేనల్లుని ప్రభావానికి లోనై, ఉదార స్వభావుడు, విశాల దృక్పథం కల కేరళవర్మ "దైవయోగం" అన్న ఖండికను ద్వితీయాక్షర ప్రాసనియమం పాటించకుండా రచించాడు. అయినప్పటికి ద్వితీయశ్రేణి కవులు రంగంలో ప్రవేశించడంతో ఈ చర్చ మరికొంత కాలం కొనసాగింది. చివరకు సమదృష్టితో రాజరాజవర్మ ఈ అంశంపై ఒక వ్యాసాన్ని వ్రాసి ప్రకటించాలని ఇరు పక్షాల వారు రాజీకి వచ్చారు.

## *సంప్రదాయమా? ఆధునికతయా?*

నిజానికి యీ సంఘర్షణకు కారణమైన అనేక భేదాభిప్రాయాలలో ప్రాసనియమం ఒక కారణం మాత్రమే. అయితే చర్చనీయాంశాలలో ఇది ప్రధానమై ఇరుపక్షాల వారి వాగ్వివాదానికి దారి తీసింది. కవితా కూర్పులో సాంప్రదాయిక పద్ధతియా లేక ఆధునిక విధానమా ఏది అనుసరణీయమని బలాబలాలు పరీక్షించుకోసాగారు. సాంప్రదాయకుల దృక్పథంలో మళయాళ కవిత్వ లక్షణాల్ని అవగాహన చేసుకుంటేగాని, కవితలో వచ్చిన

పునర్వికాసపు నిజస్వరూపం బోధపడదు. ఆ కవితా లక్షణాలు సూక్ష్మంగా ఈ క్రింద సూచింపబడ్డాయి :

(1) సుప్రసిద్ధ పౌరాణిక లేక చారిత్రాత్మక గాథ కావ్య వస్తువుకు ఆధారంగా ఉండాలి.

(2) అందులో వర్ణనలు విస్తారంగా ఉండాలి. ఋతు, పర్వత, జలధి వర్ణనలు తప్పనిసరి.

(3) అలంకారభూయిష్ఠంగ ఉండాలి. ఆ అలంకారాలు ఎంత కల్పితమైతే అంత మంచిది.

(4) అనుప్రాసలు, యమకాలు, సత్కవితా లక్షణాలు, ద్వితీయాక్షర ప్రాస నియమం విధిగా పాటించాలి.

(5) సంస్కృత వృత్తాలనే గ్రహించాలి.

(6) ప్రతిపద్య చమత్కార సంభరితంగా ఉండి, ప్రతిపద్యం కవి యొక్క పాండిత్య ప్రదర్శకమై, అతని కవితా ప్రతిభను వెల్లడించాలి.

ఒక్క మాటలో చెప్పాలంటే భావశబలతకు కాక శబ్దాడంబరానికి ప్రాధాన్యత నిచ్చారు. పైన పేర్కొన్న లక్షణాలలో సంస్కృత మహాకావ్యాల అలంకారాల లక్షణం కొట్టవచ్చినట్లు కనిపిస్తున్నది.

అసాధారణమైన చాతుర్యాన్ని ప్రదర్శించాలని కవితాగారడీలో కవులు ఒకరితో ఒకరు పోటీపడేవారు. కనుక సాహిత్యంలో సహజంగానే స్తబ్ధత నెలకొన్నది. పునర్వికాసాన్ని జీర్ణించుకున్న రాజరాజవర్మ, ఆయన వంటి దృక్పథంగల మరి కొందరు సాహిత్యంలో నెలకొన్న ఈ స్థితిని రూపుమాప సంకల్పించారు. వారందరి ప్రతినిధియైన రాజరాజవర్మ నూతన విధానానికి, ప్రాచీన పద్ధతికి మధ్య గల భేదాలను ప్రకటించాడు. అవి యీ క్రింద పేర్కొనబడ్డాయి :

(1) మలయాళంలో అప్పటికి కథా కావ్యాలు (ఇతి హాసాలు, పాటలు) నాటకాలు (ఆట కథ) అన్న ఈ రెండు ప్రక్రియలు మాత్రమే ఉన్నవి. కనుక వస్తు గ్రహణలో ఎటువంటి కట్టు బాట్లు ఉండకూడదు. భావోద్దీపకమైన ఏ వస్తువైనా కవితకు అర్హమే. పాశ్చాత్య భాషల్లో ప్రజాదరణను పొందిన ఆత్మాశ్రయ కవితను ప్రవేశ పెట్టాలి.

(2) వర్ణనలు వర్ణన కొరకే చేయకూడదు. కథాగమనాన్ని కుంటుపరచని కావ్యోద్దేశ్యానికి అనుగుణవర్ణనలే ఒప్పిదంగ ఉంటాయి.

(3) అలంకార భూయిష్ఠమైన కవిత కృత్రిమంగా ఉంటుంది. కవి అలంకారాన్ని తప్పనిసరి అని ప్రయత్న పూర్వకంగా ఉపయోగించకూడదు. సహజంగా, అప్రయత్నంగా దొరలిన అలంకారాలు అతికినట్లు కవితకు అందాన్నిస్తాయి. కవిత్వం నిరర్థకమైన అలంకార విరహితంగా ఉంటేనే శోభిస్తుంది.

(4) శ్రుతి సులభంగా వున్న పదాల ఎంపిక నిశ్చయంగా ఉత్తమ కవితకు అవసరమే. కాని యాంత్రికంగా ఇదొక ప్రత్యేకత ఆ వృత్తానికే పరిమితమై ఉండాలనుకోవడం కాని, ప్రతిపాదంలో ద్వితీయాక్షర పునరుక్తి మీదే ఆధారపడి ఉండాలని అనుకోవడం అవివేకం. ఇటువంటి కఠిన నియమానికి కట్టుబడివుండడం సహజ వాక్య నిర్మాణాన్ని, పదబంధాల కూర్పును అనవసరంగా సాగదీసి, వికృతంగా మార్చడానికి దారి తీయవచ్చు. ఒక ప్రత్యేక ధ్వని లేక శబ్దం మీద అనవసరమైన వ్యామోహాన్ని ప్రదర్శిస్తే అది శబ్దం కొరకు భావాన్ని బలిపెట్టి నట్లవుతుంది.

(5) తన కభిమతమైన యే ఛందస్సునైనా కోరుకునే స్వాతంత్ర్యం కవికి ఉండాలి. నియమబద్ధమైన సంస్కృత వృత్తాలనే ప్రయోగించాలన్న ఆవశ్యకత లేదు. జానపద రాగాల నుండి

రూపొందించబడి నానుకూలంగా మలచదగిన మళయాళ దేశీయ వృత్తాలు ప్రత్యేకంగా గేయ కవితకు అనుకూలమైనవి.

(6) ప్రాచీనులు సాధించిన కవితారీతులు పునాదులుగా కవితా భవననిర్మాణం చేయడం మంచిదే కాని, రచయితలు సంప్రదాయ ప్రక్రియల్ని యథాతథంగా అనుకరించకూడదు. కవితలో భావనే ప్రధానం కాని కల్పన కాదు. కౌశలం కన్న కళ ప్రముఖ స్థానం వహించాలి.

ఈ వివాదంలో రాజరాజవర్మ నిర్వహించిన పాత్ర ఎంతో గొప్పది. కనుకనే నూతనంగా రూపొందించిన సూత్రాలను "రాజరాజవర్మ ప్రస్తానం" అని వ్యవహరింపసాగారు.

## సాహిత్య రచనలో నవవికాసం

ఈ క్రొత్త సూత్రాలు కవితా నిర్మాణం వరకే పరిమితమైనా వీటిని వచన రచనలకు కూడా వర్తింపచేయవచ్చు. ఈ నూతన స్వేచ్ఛకు, నవీనతకు ముఖ్యంగా ఇంగ్లీషు విద్య నభ్యసించినవారు, రచయితలు, సాహిత్య రసజ్ఞులు, యువతరం స్వాగతం పలికారు. ఈ నూతన సూత్రాలను, తదనుసారమైన రచనల్ని సూక్ష్మంగా పరిశీలించినట్లయితే రాజరాజవర్మ మళయాళ సాహిత్య రచనలకి, తదవగాహనకి నవవికాసాన్ని ప్రసాదించినట్లు గ్రహించగలం. కవితపట్ల నియమ, నిబంధనలతో కూడిన సంకుచిత దృష్టిని ఖండించాడు. ప్రాచీన కావ్యాలనే అనుకరించాలన్న నిస్సారమైన, అర్థరహితమైన పట్టింపులపై తిరుగబడి ఆ శృంఖలాన్ని తెంచాడు. పద్యమైనా, గద్యమైనా సాంకేతికమైన నియమాలకు భావోద్వేగానికి అణగివుండాలని ఆయన ప్రకటించాడు. ఛాందసులైన పండితులకు, ప్రగతి కాముకులకు మధ్య జరిగిన పోరాటం వెనువెంటనే ఈ ప్రకటన చేయడం చాల గొప్ప విషయం. రాజరాజవర్మ ఆధునిక మళయాళ సాహిత్యానికి చేసిన

మహోపకారమిదే. ఇక భాషా విషయంలోనూ, కాల పరీక్షకు తట్టుకుని నిలిచే ఉత్తమ వ్యాకరణాన్ని రచించి రాజరాజవర్మ శాస్త్రీయమైన అధ్యయనానికి పునాదులు వేసినట్లు ముందే చూచాం. మహాకవి ఉళ్ళూర్ పేర్కొన్నట్లు రాజరాజవర్మ కేరళ భాషా సాహిత్యాలైన ''కైరళి''కి పునాదుల్ని బలపరచి, పై భవనాన్ని అలంకరించాడు. వాస్తవానికి రాజరాజవర్మ అనేక రంగాలలో మార్గదర్శకుడు. అసమానమైన మేధావి. మానసిక ప్రజ్ఞకు జృంభణను ప్రసాదించినవాడు. గత అర్ధ శతాబ్దకాలంలో ఇతర ప్రతిభాశాలురకన్న మిన్నగా రాజరాజవర్మ మళయాళ సాహిత్యపు వికాసానికి బాటలు నిర్మించాడు. ఒక్క మాటలో చెప్పాలంటే మళయాళ సాహిత్య పునర్వికాసోద్యమాన్ని నడిపించే బాధ్యత ఆయన వంతు అయింది.

ఆయన మహామనీషి. అంతేకాదు ఇతరుల్లోని గొప్పతనాన్ని గుర్తించి, ప్రశంసించగల గొప్ప వ్యక్తి. పరిస్థితుల ప్రభావంవలన మరుగునపడో, మసకబారో దాగివున్న సృజనాత్మక శక్తుల్ని కనుగొనగల అసమాన ప్రజ్ఞ ఆయనకుండేది. కుమరన్ ఆసన్ ప్రప్రథమ కవితాఖండమైన ''నళిని''లోని కాల్పనిక పోకడల్ని వెంటనే గుర్తించి, వాటిని లోకానికి విస్పష్టంగ చాటడానికి ఎంత ఆతురతని కనుపరచాడో ఇదివరకే చూచాం. సహోద్యోగులతో, విద్యార్థులతో, స్నేహితులతో తన సహాయాన్ని అర్థించి వచ్చే వారందరితో ఆయన వ్యవహరించే తీరు ఆదర్శప్రాయమైనది. వారి అంతస్తును, పదవిని, మతాన్ని, కులాన్ని దేనిని కూడ ఆయన లక్ష్యపెట్టేవాడు కాదు. అందుకే జోసఫ్ ముండస్సేరి రాజరాజవర్మను గురించి ఇలా అన్నాడు: ''తెలిసో, తెలియకో ఆయన తంపురాన్ కన్న (Man) మేన్, మనిషి కాగలిగాడు. ఆ రోజులలో సామాజికంగా సాంస్కృతికంగా పై అంతస్తుకు చెందిన ఆయన వంటివాడు, తనకు లీనతను, విద్యాధిక్యతను ప్రదర్శించక

పోవడం చిన్న విషయ మేమీ కాదు. తన సహాయాన్ని అర్థించిన అర్హత గల, వర్ధిష్ణువులు కాగల రచయితల నందరిని ఆయన ఉద్దేశ పూర్వకంగా ప్రోత్సహించాడు. తనతోటి పనివారిని, స్నేహితుల్ని ఉత్సాహపరిచాడు.

గౌరవాభిమానాలతో, కృతజ్ఞతతో తొణికిసలాడే కుమరన్ ఆసన్ విరచిత "ప్రరోదనం" అన్న స్మృతి కావ్య ప్రస్తావనతో ఈ స్మృత్యంజలిని ముగించవచ్చు. "ప్రరోదనం" అంటే దుఃఖాతిశయం. ఒక విద్వత్కవి మహోపకారిని గురించి మరొక మహాకవి రచించిన ఈ స్మృతి కావ్యం మళయాళ వాఙ్మయంలో ఎన్నదగిన కావ్యం. కుమరన్ ఆసన్ రాజరాజవర్మ మృతిని భరించలేక పోయాడు. తన ఆశయాన్ని, తన లక్ష్యాల్ని రాజరాజవర్మ అర్థం చేసుకున్నట్లు మరెవరూ అర్థం చేసుకోలేరని ఆసన్‌కు తెలుసు తన గుండె బరువును దింపుకోడానికి వ్రాసిన స్మృతి కావ్య మిది.

ఆ మహా విద్వాంసునికి ఈ క్రింది కవితాంజలిని (శ్లోకం) ఘటించాడు :

సరస్వతి దేవికి సమర్పించుకొని
వెనుకంజవేయని మేధావులు;
శుష్కించని సువర్ణకంఠం కలవారు;
తమరు వరప్రసాదులు
అనేకాద్భుత సాధకులు.
సిద్ధాంతంలో ఆచరణలో
శత్రువులు తలలొంచారు.
కైరలి మాత ముదమంది
తన విముక్తికి స్వాగతం పలికింది.

తన తరువాతి తరాలతోని మళయాళ రచయితల తరఫున కుమరన్ ఆసన్ క్రింది స్మృత్యంజలిని ఘటించాడు:

సర్వస్వం సమర్పించి
విధికి తలవంచి
చితిపై ఆహుతి కావడం
సర్వం భగవదిచ్ఛ కావచ్చు.
కాని మేము
నీ పవిత్రనామాన్ని నాటుతాం
కన్నీటితో తడిపి పెంచుతాం
అది పెరిగి నలుదిశల వ్యాపించి
తన్ను పరివేష్టించిన అందరిని
పూలపరిమళాలతో ఆశీర్వదిస్తుంది.
ప్రళయకాలాగ్ని అయినా
దానిని తాకలేదు.

# ఏ. ఆర్. రాజరాజవర్మ జీవిత సంఘటనలు

1863. చంగనాశేరిలో జననం.

1865. కార్తిక పల్లికి కుటుంబం తరలిపోయింది.

1877. కేరళవర్మ వద్ద శిష్యరికం.

1881. మహారాజావారి ఉన్నతపాఠశాలలో చేరడం.

1885 తులాభార ప్రబంధం.

1888. దేవీదండకం, భంగవిలాపం.

1889. బి. ఏ. పట్టం. (1889,- వివాహం)
విటవిభావరి, మేఘోపాలంభం.

1890. సంస్కృత పాఠశాలలో ఉద్యోగం.

1891. సంస్కృత భాషలో ఎం. ఏ. పట్టం.

1892. పితృప్రలాపం.

1894. మేఘదూత అనువాదం, సంస్కృత కళాశాల ప్రధానాచార్య పదవి. కుమారసంభవానువాదం.

1895. మలయ విలాసం.

1896. కేరళపాణినీయం (ప్రథమ కూర్పు).

1899. ప్రాగ్భాషల అధ్యయన పర్యవేక్షకుడు - మహారాజ కళాశాల, తిరువనంతపురం.

1900. ఆంగల సామ్రాజ్యం.

1902. భాషాభూషణం, శబ్దశోధిని.

1905. నలచరిత్ర వ్యాఖ్యానం, వృత్తమంజరి.

1906. ప్రథమ వ్యాకరణం.

1907. మధ్యమ వ్యాకరణం.

1908. అనుప్రాసను గూర్చిన వివాదం.

1909. మణి దీపిక

1910. లఘుపాణినీయం; మహారాజ కళాశాలలో సంస్కృత ద్రావిడభాషల ఆచార్యుడు.

1911. సాహిత్య సాహ్యం.

1912. మళయాళ శాకుంతలం.

1914. మహారాజ కళాశాలలో తాత్కాలిక ప్రధానాచార్య పదవీ నిర్వహణ; భాషాపరిష్కరణ సంఘ సభ్యుడు.

1915. కేరళవర్మ మరణం.

1916. మహారాజ కళాశాలలో తాత్కాలిక ప్రధానాచార్య పదవీ నిర్వహణ; మాళవికాగ్నిమిత్రానువాదం.

1917. కేరళ పాణినీయం (సంశోధిత ప్రతి) చారుదత్తానువాదం.

1918. స్వప్నవాసవదత్తానువాదం.

18-6-1918 మరణం.

1589 లో రాజా మానసింగు మేదినీపురం దారిని (ఒరిస్సా) ఒడిశా వచ్చాడు. అప్పుడు ముకుందరామ చక్రవర్తి తన చండీమంగళ అతనికి వినిపించాడు. మానసింగు మెచ్చుకుని కవికి బంగారం మురుగులూ, మధుపర్కమూ, తలపాగా, ఒక గుర్రమూ ఇచ్చి గౌరవించాడు.

చక్రవర్తి చండీమంగళలో శివాయన ఖండము, అక్షతి ఖండము, వణిక ఖండము అని మూడు ఖండాలున్నాయి.

ముకుందరామ కవికంకణుడు గొప్పకవి. పాటలో కథ నడపడమూ, సున్నితమైన హాస్యం కల్పించడమూ, పాత్రలు సజీవంగా చిత్రించడమూ అతనికి వుగ్గుపాలతోనే అలవడ్డాయి. పదహారో శతాబ్దం వంగదేశ జీవితం కన్నుల కట్టినట్టు చిత్రించాడతను. ఇతని చండీమంగళ ఈనాడు కూడా బాంగ్లా ప్రజలు ఆదరంతో గానం చేస్తున్నారు. దీని ననుసరించి ఎంతోమంది తరువాతి కవులు కావ్యాలు వ్రాశారు.

చక్రవర్తి చండీమంగళలో వొక లాలి పాట చూడండి :

"ఆరె బాచా ఆయ్ బాచా ఆయ్
కి లాగియా కాందె బాచా కి ధన చాయ్ ?
ఆనిబ తులియా గగన ఫుల,
ఏకెక ఫులెర లక్ష మూల.
సె ఫుల గాంధియా పరాబ హార,
సొనా బాచా మొర నా కాంద ఆర.
గగన మండలె పాతిబ ఫాంద,
బాంధి యా దిబ తొరె శరదచాంద,
కపాలె దివ తొరె సె చాంద ఫోట,
కాలి గరాయియా దిబ సోనార భాటా.
ఖావొయాబ క్షీరఖండ మాఖాచ చుయా,
కర్పూర పాకా పాన సరస గుయా.
రథ గజ ఘొడా జవుతిక దియా,